**teluguloo samasyaa puuraNalu**
Compiled by Budaraju Radhakrishna



Publication : April, 2005

Price : Rs. 20/-

**ISBN : 81-7443-017-2**

Title : Chandra

*Published by* P.P.C. Joshi
for Prachee Publications
3-3-859/1/A, 2nd Floor, Lane opp. Arya Samaj,
Kachiguda, Hyderabad - 500 027.
Phone : 040-2460 2009

*Type-setting :* Balaji Graphics
1-8-350, Chikkadapally, Hyderabad - 500 020.

*Printed at :* Charita Impressions
1-9-1126/B, Azamabad,
Hyderabad - 500 020.

# పరిచయం

మధ్యయుగాల్లో తెలుగుభాషాసాహిత్యాల అభివృద్ధికి ఎంతోమంది ఎన్నో విధాల ప్రయత్నించారు. రానురాను తెలుగుజాతిలో స్వభాషాభిమానం తగ్గి పాశ్చాత్య సంస్కృతి మీద మోజు పెరుగుతూ వస్తున్నదని చాలామంది ఆందోళనపడుతున్నారు. సహజంగానే పూర్వవైభవ సంపాదనకోసం యువలోకం నడుముకట్టడం మొదలయింది. 19, 20 శతాబ్దాలలో క్రమాభివృద్ధి పొందిన అవధానవిద్యను పునరుజ్జీవింపజేస్తున్నారు కొందరు. పద్యవిద్యకు మళ్ళీ పట్టాభిషేకంచేయాలని ఉబలాటపడుతున్నారు కొందరు. సమస్యాపూరణలకు ప్రాముఖ్యమిస్తున్నారు మరికొందరు. ఈ సమయంలో కొందరు మిత్రుల ప్రోత్సాహంతో తెలుగులో ప్రసిద్ధిసాధించిన సమస్యాపూరణలను ప్రచురించాలని సంకల్పించిన మిత్రుడు ప్రాచీ పబ్లికేషన్స్ అధిపతి పి.పి.సి. జోషి అటువంటి సంకలనం ఒకటి సమకూర్చి పాఠకలోకానికి పరిచయం చెయ్యమని నన్ను ప్రోత్సహించాడు. ఫలితం ఈ చిన్న పుస్తకం.

అవధానానికి ఏకాగ్రత, ధారణ ప్రధానాలు. స్మృతి మరింత అవసరం. అంతకన్నా పాండిత్యం, సద్యస్స్ఫురణ, కవితాశక్తి ఇతోధికావసరాలు. తెలుగుదేశంలో గంటకో గడియకో నూరుపద్యాలు చెప్పే ఆశుకవితాధోరణికి ఆదరణ హెచ్చు. అవధానాలు ప్రధానంగా రెండు విధాలు. వాటిలోనే సమస్యాపూరణకూ ఆశుకవితా ప్రదర్శనకూ అవకాశాలు మెండు. అష్టావధానంలో 1. కవిత్వం, 2. వ్యస్తాక్షరి, 3. గణితం, 4. సమస్య, 5. పురాణం, 6. కావ్యపాఠం, 7. చదరంగం, 8. సంభాషణ అనే ఎనిమిది విభాగాలుంటాయి. సాధారణంగా ఇవి నియుతం కావు. నిషిద్ధాక్షరి, దత్తపది, శాస్త్రచర్చ, ఆకాశపురాణం, ఆశువుగా వర్ణనలు చెప్పటం, అవధానసమయంలో మోగించిన గంటల సంఖ్యకు బదులు అవధానివీపుమీద అప్పుడప్పుడు వదలిన పూలసంఖ్య చెప్పటం, అప్రస్తుత ప్రశంస/ప్రసంగం వంటి పేర్లతో కొన్ని మార్పులుండేవి. అష్టావధానంలో కవితారసంకన్నా, సభ్యుల కోరికల విషమత్వంవల్ల బయటపడే అవధాని బుద్ధిబలం ప్రస్ఫుటమవుతుంది. మన అవధానాన్ని పూర్వం భట్టుమూర్తి వంటివారు శతలేఖిన్యవధానమనీ, గడియకు నూఱు పద్దెములు గంటము లేక రచించుట అనీ, ఘంటాశతగ్రంథకరణధుర్యత అనీ వ్యవహరించారు. మన అష్టావధానాన్ని దాక్షిణాత్యుల శతావధానంతో పోల్చవచ్చునీ, అందులో నూరుపను లేవో చేయుటమే ప్రధానంగాని కవితాశక్తి ముఖ్యం కాదనీ తిరుపతి వేంకటకవులు ప్రస్తావించారు. తమకన్నా ముందు మాడభూషి వేంకటాచార్యులవారు, దేవులపల్లి సుబ్బారాయశాస్త్రి, తమ్మన్నశాస్త్రులు

అష్టావధానాలు చేశారని వారే పేర్కొన్నారు. అష్టావధాన లక్షణాలను తామే సంస్కృతంలోనూ, మొదటిసారిగా తెలుగులోను నిర్దేశించినట్లు కూడా వారు ప్రస్తావించారు. సమస్యాపూరణం అష్టావధానంలో ప్రధానవిషయాల్లో ఒకటి.

అవధానాలనుగురించిన గ్రంథాలు సంస్కృతంలో 'ఉన్నట్లు లేద'ని ఆంధ్ర విజ్ఞానసర్వస్వం పేర్కొన్నది. శతావధానం నూరుగురు పృచ్ఛకులకు పద్యరూపంలో సమాధానాలు చెప్పే ప్రక్రియ. ఉత్తరభారతంలో ఏ అవధానమైనా ఒక్క సభలోనే పూర్తికావాలనే నియమముందనీ, పూర్ణశతావధానానికి 16 నుంచి 24 గంటల వ్యవధి కావలసి ఉండగా అంత సమయంలో అవిచ్ఛిన్నంగా అవధానం నిర్వహించటం కష్టం కాబట్టి దినానికి అయిదారు గంటల చొప్పున మూడు నాలుగు దినాల్లో పూర్తిచేయటం ఆంధ్రదేశాచారమని అదే విజ్ఞానసర్వస్వం చెప్తుంది. ఉత్తరభారతంలో అష్ట, షోడశ, పంచవింశతి అవధానాలు సామాన్యమనీ వాటిని శతావధానాలుగానే పరిగణిస్తారనీ వారి వివరణ. ఇటీవలికాలంలో ద్విగుణిత, చతుర్గుణితాష్టావధానాలనీ, సహస్ర ద్విసహస్రావధానాలనీ జరుగుతున్నాయి తెలుగుదేశంలో.

తప్పుల్లేకుండా పనస చెప్పిన వైదికుణ్ణి అవధాని అనటం కద్దు. పన్నెండు సంవత్సరాలు సంథ వల్లించి పదం, క్రమం, జట, ఘనం, రథం, పంచసంధి భేదాలతో అవధానాలు నిర్వహించటం వేదవిద్యాపాండితికి నిదర్శన. మరో విధం ఉదాత్త, అనుదాత్త, స్వరిత, ప్రచయ భేదాలతో వేదం వల్లించే స్వరావధానపద్ధతి ఉంది. 'స్వరావధాన'మనే గ్రంథమూ ఉన్నది. నేత్రావధానం మరో పద్ధతి. ఇద్దరు కేవలం నేత్రసంజ్ఞల ద్వారా ఎదుటివారి ప్రశ్నలకు సమాధానాలు చెప్పటమది. తెలుగులో నందగిరి శేషగిరిరావుగారు 'అవధానదర్పణ' మనే గ్రంథం ప్రచురించారు.

అవధానాల్లో ఆశుధోరణిలో సమస్యాపూరణం చేయుటం ప్రత్యేకాకర్షణ. సమస్యాపూరణలను ఈ చిన్న పుస్తకంలో ప్రచురిస్తున్నాం. దీనికి ఆధారభూతమైన పూర్వప్రచురణలను-సమయానికి మాకు అందుబాటులో ఉన్నవాటిని - పేర్కొన్నాం. ప్రత్యేకించి శ్రీనాథాదులు చేసిన సమస్యాపూరణలు కొన్ని లభించాయి. పృచ్ఛకులెవరో, పూరకులెవరో తెలిసిన సందర్భాల్లో ఆ వివరాలను సంకేతాల ద్వారా సూచించాం. తెలియని సందర్భాల్లో ఆధారగ్రంథాన్ని మాత్రం పేర్కొన్నాం. కొన్ని సమస్యలు నేటి సామాజిక సాంస్కృతిక వాతావరణంలో అశ్లీల మనిపించినా, అస్పష్టంగానో అసందర్భంగానో ఉన్నా యనిపించినా వాటిని పరిహరించాం. ఒకే కవి పృచ్ఛకుల కోరిక ప్రకారం ఒకే సమస్యను భిన్నపద్ధతుల్లో పూరించినా, కొద్దిపాటి మార్పులుండి గాని, లేకగాని ఒకే సమస్యను - లేదా ఒకే రకం సమస్యను - భిన్న సందర్భాల్లోనో

కాలాల్లోనో ఒకరికి మించిన సంఖ్యలో భిన్నావధానులు పూరించినా వాటిని తెలిసినంతలో ప్రచురించాం. సమస్యాపూరణ విషయంలో కాలనిర్ణయం చేసి కాలక్రమంలో వాటిని ప్రదర్శించే బాధ్యతను తలకెత్తులో లేదు. సమస్యలను అకారాది క్రమంలో అమర్చాం. ఇది పూర్వపూరణలను సమకాలికుల దృష్టికి తెచ్చే ప్రయత్నమేగాని సమస్యాపూరణ సర్వస్వమనిగాని, పరిశోధితశాస్త్రప్రసంగమనిగాని పరిగణించవద్దని మా మనవి. దిక్ప్రదర్శనగా కొన్ని సమస్యలనూ, వాటిని తెలుగుకవులు పూరించిన పద్ధతులనూ భాషాసాహిత్యాభిమానులకు అందించే చిన్న ప్రయత్న మిది.

ఈ చిన్న పుస్తకాన్ని పాఠకలోకం ఆమోదించి ఆదరిస్తుందని ఆశిస్తున్నాం. కొత్త సూచనలు వస్తే వాటిని పాటించగల శక్తి మాకుంటే మలి ప్రయత్నంలో మరింత శ్రమించగలం.

హైదరాబాద్ - బూదరాజు రాధాకృష్ణ
**22-3-2005**

## కృతజ్ఞతలు

'తెలుగు సమస్యలు' (**1953**, వావిళ్ళ) ప్రతిని పంపించి దానికి మరికొన్ని సమస్యాపూరణలనూ, పరిచయాన్నీ చేర్చి ప్రచురించమని సూచించిన శ్రీ ఇప్పగుంట సాయిబాబాగారికి; ఈ బాధ్యతను స్వీకరించి, అభిప్రాయాలు పంచుకుంటూ నిర్వర్తించి యీ రూపాన్నిచ్చిన మిత్రులు శ్రీ బూదరాజు రాధాకృష్ణగారికి; ఆయా గ్రంథాల్ని అందజేసిన శ్రీయుతులు రాపాక ఏకాంబరాచార్యులు, బుడ్డిగ సుబ్బరాయన్, ఏటుకూరి ప్రసాద్, కేతు విశ్వనాథరెడ్డి గార్లకు; బాలాజీ గ్రాఫిక్స్‌వారికి, చరిత ఇంప్రెషన్స్‌వారికి...

హైదరాబాద్ - ప్రచురణకర్త
**22-3-2005**

| క్ర.సం. | ఆధారగ్రంథాలు | సంకేతాలు |
|---|---|---|
| 1. | తెలుఁగు సమస్యలు (1880, 1921), 1953<br>- వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు | తె.స. |
| 2. | చాటుపద్యమణిమంజరి (1914, 1917)<br>చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగం 1952<br>- సంకలనకర్త : వేటూరి ప్రభాకరశాస్త్రి | చా.మ. |
| 3. | చాటుపద్యరత్నాకరము (1917, 27, 61, 65) 1992<br>- సంకలనకర్త : దీపాల పిచ్చయ్యశాస్త్రి | చా.ర. |
| 4. | శతావధానసారము - పూర్వార్థము } 1956<br>శతావధానసారము - ఉత్తరార్థము<br>- తిరుపతి వేంకటకవుల శతావధానసారము,<br>ప్రచురణకర్త : చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి సన్సు, కడియం | శ.సా.పూ.<br>శ.సా.ఉ. |
| 5. | కొప్పరపు సోదరకవుల కవిత్వము-2003<br>(శతావధానములు, ఆశుకవితలు, పండితప్రశంసలు)<br>సంపాదకుడు : డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ, గుంటూరు<br>ప్రచురణ : శ్రీ కొప్పరపు కవుల కళాపీఠము, విశాఖపట్టణము | కొ.సో.క. |

**అవధానులు**

| | |
|---|---|
| కొప్పరపు సోదరకవులు | కొ.సో. |
| తిరుపతి వేంకటకవులు | తి.వేం. |
| మోచెర్ల వెంకన్న | మో.వెం. |

(ఇతరుల పూర్తి పేర్లే తెలిసినంతవరకు పేర్కొన్నాం. పేరు తెలియనప్పుడు : ?)

1. "అంగములేనివాఁడు తనయాలినిఁగూడి సుఖించెనెట్లనో" (శ.సా.పూ; బెజవాడ)

"భంగమువచ్చె నో హర! కృపాకర! మత్పతి దోషి కాఁడు, పే
ర్మిం గరుణింపవే నుపశమింపదు నా పరితాప"మ న్మనో
జాంగనకై హరుండు కరుణాకరుఁడై వరమిచ్చె, మీఁద న
య్యంగములేనివాఁడు తనయాలినిఁగూడి సుఖించె నెట్లనో. (తి.వేం.)

2. "అందఱు నందనే మఱియు నందఱు నందనె యుందఱందనే" (?)

కొందఱు భైరవాశ్వములు, కొందఱు పార్థుని తేరి టెక్కెముల్,
కొందఱు ప్రాక్కిటీశ్వరులు, కొందఱు కాలుని యెక్కిరింతలున్,
కొందఱు కృష్ణజన్మమునఁ గూసినవారలు, నీ సదస్సులో
నందఱు నందనే మఱియు నందఱు నందనె యుందఱందనే.(శ్రీనాథుడు)

(సంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

కొందఱు సంస్కృతాంధ్రములఁ గొందఱు ద్రావిడ కన్నడంబులన్
గొందఱు యావనాంగ్లములఁ గోవిదు, లిట్టి ఘనుల్ భవత్సభా
మందిరమందు గౌరవసమగ్రత నుండినవార లెన్న నీ
యందఱు నందనే మఱియు నందఱు నందనె యుందఱందనే. (కొ.సో.)

3. "అంధుం డర్ధనిశీథమందుఁ గనె నయ్యర్కేందుబింబమ్ములన్"(శ.సా.పూ., కాకినాడ)

పుంధర్మైత సరస్వతీకవులతో భూపాలకుం "డాదితే
యాంధస్తీక్ష్ణగభస్తి బింబముల దీవ్యద్వృత్తి వర్ణించి స
ద్గ్రంథమ్ముల్ రచియింపుఁడీ" యనినఁ దద్గ్రంథానుసంధానని
ర్బంధుం డర్ధనిశీథమందుఁ గనె నయ్యర్కేందుబింబమ్ములన్. (తి.వేం.)

4. "అంధు డాలయముఁ గాంచి యానందించెన్" (బాపట్ల శతావధానం)

బంధురశక్తిని లేచి సు
ధాంధుల నడలింపఁ జంద్రధరుఁ గన భక్తిన్
సంధించి బాణుఁ డను గ
ర్వాంధుం డాలయముఁ గాంచి యానందించెన్. (కొ.సో.)

5. "అక్కా! రమ్మనుచు మగఁడు నాలిం బిలిచెన్" (వా.ర.)

అక్కసి వలె ముప్ప్రొద్దును
మెక్కుచుఁ దిరిగెదవు కాలిమెట్టున నిన్నున్
గుక్కక మానను దనినీ
యక్కా! రమ్మనుచు మగఁడు నాలిం బిలిచెన్. (మో.వెం.)

వక్కాకు మడిచివేసుక (తె.ప.)
చక్కెర విలుకానికేళి సలుపుద మనుచున్
చక్కని ముద్దుల మఱఁదలి
యక్కా! రమ్మనుచు మగఁడు నాలిం బిలిచెన్. (?)

6. "అమవసనాఁటి రాత్రి నొక యంగన సూపెను జందమామనున్" (తె.ప.)

తమసము మించు టేయెడల దానవహోమగృహంబు వావర
ప్రముఖు లెఱుంగు బి(?)ట్టు లల నే(?)శ్యశిఖామణి కెద్దిసామ్యి యే
కముల సుగంధి మన్మథునిఁ గన్నదొ బెబ్బులి యేడ నుండునో
అమవసనాఁటి రాత్రి నొక యంగన సూపెను జందమామనున్. (?)

7. "అమవస నిండుండు తోఁచె నద్దమరేయిన్" (శ.సా.ఉ., బందరు)

కమలాక్షుఁ డొక్క గోపిక
"యమునస" యని జంక నద్దమం దచ్చెలి ఫా
లముఁ జూపి యనియెఁ "గను మెటు
లమవస నిండుండు తోఁచె నద్దమరేయిన్". (తి.వేం.)

8. "అస్ఖలితబ్రహ్మచారి కార్గురు పుత్రుల్" (వా.ర.)

ఈ స్వాప్రాసము దుష్కర
మస్ఖలనత నీయఁదగునె యది సుకవులకున్?
సస్ఖలత లయి గుహుం గని
రస్ఖలితబ్రహ్మచారి కార్గురు పుత్రుల్. (మో.వెం.)

9. "ఆకులు పోకలీయ నగుఁగా పదినూటులు సున్నమేటికిన్?" (రాధాకృష్ణపరముగా)

ఓ కమలాక్షి! రాధ కొనయూపిరి నున్నది నిన్నుఁ జూడఁగాఁ
గాకలఁదీఱు మారుశరకాండముఁ గావఁగ నంగకాళి, ము
క్తాకమనీయహార మది తద్ద కఱంగెడు, నత్తునంచు మా
కాకులు పోకలీయ నగుఁగా పదినూటులు సున్నమేటికిన్? (కా.సో.)

10. "ఆకులు పోకలుం గలుగ నంటియు చాలును సున్నమేటికిన్?" (తె.స.)
శ్రీకరకీర్తిహార! గుణశేఖర! కొమ్మనమంత్రి తిక్కనన్
రాకలుగోరి ముగ్ధ యనురాగము చెందిన మన్మథాగ్నిచేఁ
బ్రాకటమైన ముత్యములు పాకమునైనవి, వేగ తేర యా
ఆకులు పోకలుం గలుగ నంటియు చాలును, సున్నమేటికిన్? (?)

11. "ఇంకన్ గస్తురిబొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్" (చా.ర.)
పంకేజానన! నేటిరేయి వినుమీ పంతంబుతో రాహువున్
శంకాతంకము లేక షోడశకళాసంపూర్ణు నేణాంకునిం
బొంకం బార్పెదనంచుఁ బల్కినఁ దగన్ బొంచుండి నేనింటి నీ
వింకన్ గస్తురిబొట్టు పెట్టకుము తన్వీ! ఫాలభాగంబునన్. (మో.వెం.)

12. "ఇనశశిబింబయుగ్మ ముదయించె దినాంతమునందు పద్దిశన్." (చా.ర.)
"ఇనసమతేజ! మీరు సెలవిచ్చిన పీఠము హేమరత్నసం
జననము మేరుప్రస్తరము చక్కఁగఁ దీర్చితి, పక్షమయ్యె, నే
ర్పున సురకోటులం దిశలఁ బొల్పుగ వ్రాయుచు రాఁగ నేఁటికిన్
ఇనశశిబింబయుగ్మ ముదయించె దినాంతమునందు పద్దిశన్. (మో.వెం.)

13. "ఇఱుకరాదు, కొఱుకరాదు, నఱుకరాదు, పెఱుకరాదు"లతో పద్యము (చా.ర.)
ఇఱుకరాదు చేత నిసుమంత నిప్పైనఁ
గొఱుకరాదు నినుము కొంచెమైన
నఱుకరాదు నీరు నడిమికి రెండుగాఁ
బెఱుకరాదు బావి పెల్లగిలఁగ. (మో.వెం.)

14. "ఈః కల పారస్యము నీకగాని తెలియుంగారాదు బింబాధరీ!" (శ.సాపూ., ధవళేశ్వరం)
"కలగంటిన్ వివరింపు మీ కల చమత్కారంబు నీ" వంచు న
వ్వాలయున్ బల్కిన వారకాంతఁ గని "యోహో! యాకలా! యాకలా
లలనా! నా కది చెప్ప శక్యమగునా? లక్షించి చూడంగ నీ
కల పారస్యము నీకగాని తెలియుంగారాదు బింబాధరీ!" (తి.వేం.)

15. "ఈఁతాకుల గుడిసెలోన నినుఁ డుదయించెన్" (తె.స.)
సీతాపతి పూఁదోఁటకు
నేతా మెత్తేటి వేళ యిప్పుడు వచ్చెన్

పోతా, పడుకున్నావా
యీతాకుల గుడిసెలోన? నినుఁ డుదయించెన్. (?)

16. "ఉత్తరమున భానుబింబ ముదయంబయ్యెన్" (వా.ర.)
ఆత్తుగఁ దూరుపు పడమరఁ
జిత్తరువు లిఖించి నిదురఁ జెందితి, వౌరా!
చిత్తరువు వ్రాయఁబోవలె
నుత్తరమున, భానుబింబ ముదయంబయ్యెన్. (మొ.వెం.)

17. "ఉఱుకఁ దఱుమంగఁ దఱుమంగ నుఱుకుటయ్యె" (శ.సా.ఉ., గుంటూరు)
సరగ నాసేన యీసేన యురవడింపఁ
దాఱుమాఱయ్యె మాఱు తార్కై రహించె
నాఱుపదియును బదియునాఱై చెలంగె
నుఱుకఁ దఱుమంగఁ దఱుమంగ నుఱుకుటయ్యె. (తి.వేం.)

18. "ఎలుకలు తమ కలుగులోని కేనుఁగు నీడ్చెన్" (వా.ర.)
ఇలలో నిద్దరు రాజులు
మలయుచుఁ జదరంగ మాడి మాపటివేళన్
బలమెత్తి కట్ట నుఱిచిన
వెలుకలు తమ కలుగులోని కేనుఁగు నీడ్చెన్. (మొ.వెం.)

19. "ఏకాదశినాఁడు సప్త మేడే ఘడియల్" (తె.స.)
శ్రీకాంతుని దిన మెన్నఁడు?
రాకొమరుని కెద్ది ప్రియము? రథతిథి యెన్నం?
డే కొలఁది కన్నె మఱుగును?
ఏకాదశి, నాఁడు, సప్త, మేడే ఘడియల్. (?)

ఓ కాంత! నాదు పెనిమిటి
యేకాంతనా చూడఁబోయి నేటికి నాల్గే
చేకొని లెక్కింపుము నేఁ
డేకాదశి, నాఁడు సప్త మేడే గడియల్. (?)

20. "ఏతపుఁగొమ్ముమీఁద నొక యేనుఁగు సింగము వేఁటలాడఁగన్" (తె.స.)
నూతి జలంబులోన నొకనూఱు శిరంబుల యెద్దు మేయఁగా
నాతి పయోధరమ్మునను నల్లని చంద్రుఁడు గాయుచుండఁగా
గోఁతికిఁ బిల్లికూనకును ఘోరపు వైరము గల్గుచుండఁగా
నేతపుఁగొమ్ముమీఁద నొక యేనుఁగు సింగము వేఁటలాడఁగన్. (?)

21. "ఒడ్డాణ మలంకరించె నువిదకుచంబుల్" (శ.సా.పూ.: కాకినాడ)
అడ్డమయినట్టి విటులకు
బిడ్డలఁ గని బిరుసు దక్కి బింకము చెడి యా
బిడ్డలు పాలకు పీడ్వఁగ
నొడ్డాణ మలంకరించె నువిదకుచంబుల్. (తి.వేం.)

22. "కన్నకుమారుండు మగఁడు గాఁగ వరించెన్" (తె.స.)
అన్నన్న! రాధ సొగసున
కెన్నికయగు మగఁడు లేమి హేలాగతిచే
నన్నయగు నందగోపుఁడు
కన్నకుమారుండు మగఁడు గాఁగ వరించెన్. (?)

23. "కన్నకుమారునిన్ మగనిగాఁ గనె సజ్జనులెల్ల మెచ్చఁగన్" (తె.స.)
పున్నమినాఁటి రేవెలుఁగుఁబోలు మొగంబు, మెఱుంగు సిబ్బెపున్
జన్నులు, వాలుగన్నులును, జవ్వనముం గల బాణపుత్రి పే
రు న్నగరాజధీరు ననిరుద్ధకుమారుని స్వప్నమందుఁ దా
కన్నకుమారునిన్ మగనిఁగాఁ గనె సజ్జనులెల్ల మెచ్చగన్. (?)

24. "కన్నెరికము చెడకమున్నె గర్భంబాయెన్" (తె.స.)
చిన్నది పండ్రెండేళ్లది
యెన్నఁడు రతికేళిసుఖము నెఱుఁగక మునుపే
వెన్నున తామర పుట్టెను
కన్నెరికము చెడకమున్నె గర్భంబాయెన్. (?)

25. "కప్పం గని శేషుఁడంత గడగడ వడఁకెన్" (తె.స.)
తప్పక చూచి ఖగేంద్రుఁడు
నొప్పుగ నామింటికెగిరి యొయ్యన చనుటన్

అప్పుడు రెక్కల నీడం
గప్పం గని శేషుఁ డంత గడగడ వణఁకెన్. (?)

26. **"కప్పను జూడంగఁ బాము గడగడ వణఁకెన్"** (వా.ర.)

కుప్పల కావలి పనిలోఁ
జెప్పులు కట్టియును బూని శీఘ్రముతోడం
జప్పుడగుచు వచ్చెడి వెం
కప్పను జూడంగఁ బాము గడగడ వణఁకెన్. (మో.వెం.)

27. **"కప్పకు సంపంగినూనె కావలె, ఏంటే?"** (వా.ర.)

ఇప్పురమేలెడి పార్థివుఁ
డిప్పుడు సీతాపుకనిచె నిదిగో యార్యా!
తెప్పున నంగడి తలుపులు
కప్పకు, సంపంగినూనె కావలె, ఏంటే? (మో.వెం.)

28. **"కమ్మలు మోకాళ్ల దాఁకి ఘలుఘలు మనియెన్"** (వా.ర.)

కొమ్మను మదనుం డపుడు జ
వమ్మున నీలోత్పలముల వడిఁ గురియంగా
సొమ్మసిలి మోము వంచినఁ
గమ్మలు మోకాళ్ల దాఁకి ఘలుఘలు మనియెన్. (మో.వెం.)

29. **"కలహాపుదుంప భూమిసుయిఁ గామినిగాదె తలంచి చూచినన్?"**
(శ.సా.పూ.: ధవళేశ్వరం)

కలకలనవ్వు నెమ్మొగము గప్పడఁజేయుచు గబ్బిగుబ్బలన్
గులుకఁగఁ జేసినంతన దిగుల్పడి యెంతటి నీతిశాలియున్
వలచును దాని, నద్ది పెఱవానినిఁ గూడిన వానిఁ జంపు, నాఁ
గలహాపుదుంప భూమిసుయిఁ గామినిగాదె తలంచి చూచినన్? (తి.వేం.)

30. **"కన్నులలోఁ జన్నులమరెఁ గాంతామణికిన్"** (తె.స.) (వా.ర.)

చిన్నని ఝుషకంబులు గొని
చెన్నలరఁగ బెస్తవారి చిన్నది రాఁగా
సన్నుగ తొమ్మునఁ గల వల
కన్నులలోఁ జన్నులమరెఁ గాంతామణికిన్. (మో.వెం.)

31. "కమలబాంధవుఁ డేతెరఁ గలువ విచ్చె" (చీరాల శతావధానం)

జంపతుల కాత్మమోదంబు సొరునింప
జారచోరుల గుండియల్ సంచలింప
విదితరుచి మీఱ రోహిణీహృదయకమల
కమలబాంధవుఁ డేతెరఁ గలువ విచ్చె. (కొ.సో.)

32. "కరవది, పంగొల్లు, కొప్పోల, దశరాజపల్లె అనే గ్రామనామాలు వచ్చేట్లా ద్రౌపదీ పరాభవకథ వచ్చేట్లా గీతపద్యం" (చా.ర.)

"బంధు కఱవది యేలోయి పార్థివేంద్ర!
కుమిలి జనులెల్ల రవరవం గొల్లుమనఁగ"
వనఁగ మానిని కొప్పోలి వదరనీడ్చె
పాపదశరాజు పల్లెత్తి పలుకఁడయ్యె! (మో.వెం.)

33. "కరోమి, వదయామి, పయామి, యామి అను పదములు వచ్చునట్లు విష్ణుస్తవము" (చీరాల శతావధానం)

గరిమ న్నిల్పక, రోమిటారివలెఁ గుల్కన్ సాగె దుర్మేధ, ధీ
వర హృత్పంకజ! యామికుండు నిశఁ బ్రోవం జూచినట్లే యటో
ధరహింసంగను దేవ! యామిడిని బొందంజేయుకే యెందు శ్రీ
ధర! యామిన్యధిపాన్వయేశ! సురవంద్యా! కృష్ణ! భక్తావనా! (కొ.సో.)

34. "కలువకంటికిఁ గుంకుమ గరళమయ్యె" (శ.సా.ఉ.: బాపట్ల)

ఎలమి సొంపున కర్ధమై యొసఁగుకతన
హరతృతీయాంబకాగ్ని ధూమాతిరేక
మల్లనల్లన సోకిన నద్రిచూలి
కలువకంటికిఁ గుంకుమ గరళమయ్యె. (తి.వేం.)

35. "కవికొప్పునె సర్వలోకకాంతరవిరుచుల్?" (చీరాల శతావధానం)

ప్రవిమల గతి సారసచయ
ము విలాసముఁ జెంద జగము పొగడఁగఁ దిమిరం
బవలఁబడఁద్రోయుటను ఘనా
కవి కొప్పునె? సర్వలోకకాంతరవిరుచుల్. (కొ.సో.)

36. "కవిగాంచునె పగఁటియందుఁ గవికులతిలకా?" (శ.సా.ఉ.: బెజవాడ)

అవిశేషం బగు గతి జం
తువులు దివారాత్రములు గనుంగొన నేర్చున్
రవియున్న నడలు నల ఘూ
కవిగాంచునె పగఁటియందుఁ గవికులతిలకా? (తి.వేం.)

37. "కాంతామణిచంటిమీఁదఁ గాకర మొలచెన్" (తె.స.)

చింతామణి యను బాపఁడు
పంతంబున గోడమీఁదఁ బ్రతిమను వ్రాసెన్
అంతట వర్షము గురిసెను
కాంతామణిచంటిమీఁదఁ గాకర మొలచెన్. (?)

38. "కాంతుఁడు లేనివేళఁ గలకంఠి కిలక్కున నవ్వెఁ గిన్కతోన్" (బాపట్ల శతావధానం)

కంతుని వాడిచూపులను గాసిలు నన్ దయఁ గావ వత్తునం
చింతకు రాకఁదక్కెఁ బ్రియుఁ డేమిటికో యని బిట్టు దూఱుచున్
జెంతయుఁ గోపమూను సరసీరుహలోచనఁ జేరి నాతఁడున్
గాంతుఁడు లేని వేళఁ గలకంఠి కిలక్కున నవ్వెఁ గిన్కతోన్. (కొ.సో.)

39. "కాకరపూవూచి నిమ్మకాయలు కాచున్" (తె.స.)

కాకర కేటికి యుదకము?
చేకొని యీ కొమ్మ! నిమ్మచెట్టుకుఁ బోయనే
కాకరకాయలు కాచును
కాకరపూవూచి నిమ్మకాయలు కాచున్. (?)

40. "కామిగాఁడు; మోక్షకామిగాఁడు" - సీసపద్యంలో. (వా.ర.)

నిపుణత్వమున రాజనీతి యెఱుంగక
        నేల నేలెడువాఁడు బేలగాని,
సంగీతసాహిత్యసరసత నెఱుఁగక
        కృతిచెప్పువాఁడు దుష్కృతుఁడుగాని,
కుశలుఁడై యింతుల కోరికల్ దీర్పని
        విషయాతురుండు దుర్విటుఁడుగాని,
మాధవ శ్రీపాదమగ్నతఁ జెందక
        ముక్తిఁ గోరెడువా(?)ఁడు రక్తిగాని,

అతిదయాళిసక్తి, యతులితమగు యుక్తి,
యంగనానురక్తి, యచలభక్తి -
పరతఁ గాంచకున్నఁ బతిగాఁడు కవిగాఁడు
కామిగాఁడు: మోక్షకామిగాఁడు. (?)

41. **"కామినికుచమధ్యమందు గరుడుం డాడెన్"** (దా.ర.)
చేమంతిచెట్టుక్రిందను
భామామణి నిదురపోవఁ బయ్యెద జాఱన్
రోమావళి పామో యని
కామినికుచమధ్యమందు గరుడుం డాడెన్. (మో.వెం.)

42. **"కామిని పాదనూపురము ఖంగున మ్రోఁగదు, హేతు వేమొకో?"**
(కానుకొలను త్రివిక్రమరామారావు, మద్రాసు)
(ఇది ఉత్పలమాలలో నుండఁగూడదు)
తన జారకృత్య మితరులు
గనకుండఁ బటంబుఁజుట్టెఁ గాళ్ళ కిపుడు, కా
మిని పాదనూపురము ఖం
గున మ్రోఁగదు హేతు వేమొకో? యననేలా? (కొ.సో.)

43. **"కాముఁడు వెన్నెలల్ గురిసెఁ గంతుఁడు బాణము లేసె నెచ్చెలీ!"**
(పంగిడిగూడెం శతావధానం-1)
నా మది నాటుకొన్న యలనాఁడు మొదల్ ప్రిదులంగఁబోవఁ దా
కోమలమూర్తిరూప, మొనఁగూడదు కార్యము, విల్వ దింక నా
నీమము, కోకిలం బదె ఖణిళ్ళని అంకెలు వేసె, రోహిణీ
కాముఁడు వెన్నెలల్ గురిసెఁ, గంతుఁడు బాణము లేసె, నెచ్చెలీ! (కొ.సో.)

44. **"కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్"** (వా.మ.: బట్టుమూర్తి)
(భారత సంబంధంగా)
రంజనొసెడి పాండవు లరి
భంజనులై విరటుఁగొల్వఁ బాల్పడి రకటా!
సంజయ! విధి నేమందును?
కుంజరయూథంబు దోమకుత్తుక సొచ్చెన్! (రామకృష్ణుడు)

(రామాయణ సంబంధంగా)

అంజన కొమరుని నుడి వా
సిం జని రాఘవుఁడు, రవిజు చెల్మికి నచటం
గొంజక వసించె, నయయో!
కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్. (కొ.సో.)

45. "కుండను గొండఁ జొచ్చె నిదిగోయని పల్కెను విస్మయమ్మునన్" (పిఠాపురం అష్టావధానం)

కొండలు రేఁగి లోకముల గుండలు సేయుచునుండఁ జూచి యా
ఖండలుఁ డుద్ధతుండయి యఖండపరాక్రమ మొప్ప ఱెక్కలన్
జెండఁ గడంగుటన్ దెలిసి శీతనగాత్మజుఁ డబ్ధి వజ్రి రా
కుండను గొండఁజొచ్చె నిదిగోయని పల్కెను విస్మయమ్మునన్. (కొ.సో.)

46. "కుందేలును కోడిపిల్ల గుటుకున మ్రింగెన్" (తె.ప.)

చందనగంధులు ముగ్గురు
మందారపుఁదోఁటలోన మాపటివేళన్
అందంది పూలుగో యా
కుందేలును కోడిపిల్ల గుటుకున మ్రింగెన్. (?)

47. "కుందేళులు రెండు వచ్చి కుచములఁ గఱచెన్" (తె.ప.)

కందర్పుని పూఁదోఁటను
జందనముఖు లిద్దఱొచ్చి చతురత మెఱయన్
నందంది పూలుగో యా
కుందేళులు రెండు వచ్చి కుచములఁ గఱచెన్. (?)

48. "కుక్కచేతను బడె కదా కుంజరంబు!" (బాపట్ల శతావధానం)

దుర్బలుం డకృతాస్త్రుఁ డీ ద్రుపదపుత్రు
చేత ద్రోణుండు చాపదేశికుఁడు పడియె
నన్నమాత్రన యచ్చెరువయ్యె మదికిఁ
కుక్కచేతను పడెఁగదా కుంజరంబు! (కొ.సో.)

49. "కుక్కవో నక్కవో ఫణివొ క్రోఁతివొ పిల్లివొ బూతపిల్లివో"

(సింగభూపాలాస్థానంలో భట్టుకవి)

తక్కక రావుసింగ వసుధావరుఁ దర్థుల కర్థ మిచ్చుచో
దిక్కుల లేవి కర్ణుని దధీచిని ఖేచరు నేల్చుస్రామఁ బెం
పెక్కిన కామధేనువు శిబీ(?)ంద్రుని నెన్నెదు భట్టు! దిట్టవై
కుక్కవో నక్కవో ఫణివొ క్రోఁతివొ పిల్లివొ బూతపిల్లివో?      (శ్రీనాథుడు)

50. "కుక్కుట గృహమందుఁ గాకఘూకము లుండెన్"      (గుంటూరు శతావధానం)

ఒక్కఁడగు బోయ పక్షుల
నక్కజముగ నెన్ని జాతు లనఁదగువానిం
గక్కురితిఁ దెచ్చి యొక్కటఁ
గుక్కుట, గృహమందుఁ గాకఘూకములుండెన్.      (కొ.సో.)

51. "కుటిలాలక యెడమకన్ను కుడికన్నాయెన్"      (దా.ర.)

నిటలమున నీవు దాల్చిన
పటుతర కస్తూరిరేఖ బహురతిచేత
న్నటునిటు జాఱిన చెమటకుఁ
గుటిలాలక యెడమకన్ను కుడికన్నాయెన్.      (మో.వెం.)

52. "కుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరిపుర్వని యెంతురేగదా?"

(సంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

కట్టిఁడి సూర్యనందనుఁడు కార్యమెఱుంగక దుష్టబుద్ధియై
చుట్టలు మిత్రులున్ సతులు సూరెలఁగొల్వ సుఖాన నున్నవాఁ
డట్టె? యిఁకేల తామసిల? నాతని త్రు ళ్ళడఁగింపు లక్ష్మణా!
కుట్టకయున్న వృశ్చికముఁ గుమ్మరిపుర్వని యెంతురేగదా?      (కొ.సో.)

53. "కొక్కురోకో యనుచుఁ గోడి కూఁతఁగూసె"

(సంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

కినిసి నవదంపతులుఁ జోరులును శపింపఁ
బ్రభుభటులు నైష్ఠికులుఁ గార్యపరత నేగఁ
దమ్మిగుమ్మడులకు సోయగమ్ము హెచ్చఁ
గొక్కురోకో యనుచుఁ గోడి కూఁతఁగూసె.      (కొ.సో.)

54. "కోడెలతోడ ఢీకొనియుఁ గూలెఁగదా ముసలెద్దులొక్కటన్!" (బాపట్ల శతావధానం)

వాఁడి తొలంగి దేహబలవైభవమున్ మఱి బుద్ధిశక్తియున్
గూడఁ దొలంగి దుష్కవులు కొందఱు సత్కవి సింహపోతముల్
పోఁడిమిఁ జూపఁగా నెదిరి పోరి యడంగెడునట్లు గాఁగ నా
కోడెలతోడ ఢీకొనియుఁ గూలెఁగదా ముసలెద్దులొక్కటన్! (కొ.సా.)

55. "కోతికినిం గొమ్ములాయు గుజ్జముకు వలెన్" (తె.ప.)

రాతి రొక హయము నమ్మతి
నాతురపడి హస్తికొమ్ము లాతింటికినిన్
ఈఁతతిఁ గొనుగో లిచ్చెదఁ
గోతికినిన్ గొమ్ములాయుఁ గుజ్జముకు వలెన్. (?)

56. "కోయుంచుం దొలికోడి కూయుదనుకం గోపంబె బింబాధరా?" (తె.ప.)

ఆయెం బోయె నిశీల నావలనఁ ద ప్పామాట సైరింపవా
ఆయెూ కానము నీ మనంబు; దయమీఱం బల్కు పింతైన; నీ
ప్రాయం బేటికి నిన్నుఁ బాసినఁ దృణప్రాయం బయో! "కొక్కురో
కో" యుంచుం దొలికోడి కూయుదనుకం గోపంబె బింబాధరా? (?)

57. "క్రమమని యెంచి పంచెఁ గవిరాయఁడు భారతి యుస్తువంతయున్"
(బాపట్ల శతావధానం)

ప్రమదము దోప గాయకులుఁ బాండితిగల్గినవార లొక్కెడన్
సమరము సేయుచుండఁ గని శారద యుందటి మాత "యిందు న్యా
యము కవిరాజ తెల్పు"మనె నయ్యెడ రాజు నిజంబుఁ దెల్పుటే
క్రమమని యెంచి పంచెఁ గవిరాయఁడు భారతి యుస్తువంతయున్. (కొ.సా.)

58. "గణచతుర్థివాఁడు ఫణిచతుర్థి" (శ.సా.ఉ., కీర్తంపూడి)

"ఎన్ని దినములాయె నిట నన్ను డించి నీ
వరిగి" యనినఁ బత్ని కనియె భర్త
"నేఁటి కెన్నఁగఁ బదినెల లాయెఁగా! నేఁడు
గణచతుర్థి; నాడు ఫణిచతుర్థి." (తి.వేం.)

59. "గరుడుఁడు గణపతికిఁ దండ్రిగావలెఁ జూమ్మీ" (పిఠాపురం అష్టావధానం)

హరుఁడు గణపతికిఁ బోలెన్
సరసిజాక్షుండు నాభిజన్మునకుఁ బలెన్

గురుకీర్తిఁగన్న యా సా
గరుఁ డుడుగణపతికిఁ దండ్రిగావలెఁ జుమ్మీ. (కొ.సో.)

60. "గర్భములోనుండి వెడలెఁ గమలాప్తుఁ డొగిన్" (తి.వ.)
దుర్భర వేదన సలుపక
యర్భకుఁ డుదయించు ననుచు నతిమోదముతో
నిర్భరత నుండెఁ బ్రాక్పతి
గర్భములోనుండి వెడలెఁ గమలాప్తుఁ డొగిన్. (?)

61. "గవ్వకుఁ గొఱగావు మేటికవి నెదిరించినన్" (గుంటూరు శతావధానం)
ఇవ్విధమునఁ గాకుంటా
చివ్వకుఁ గాల్దువ్వి మున్నె చెడిపోయితివా?
నెవ్వగ పోయెనె? యిపుడుం
గవ్వకుఁ గొఱగావు మేటికవి నెదిరించినన్. (కొ.సో.)

62. "గాడిద యేడ్చెంగదన్న! ఘనసంపన్నా!" (చా.ర.)
ఆడిన మాటను దప్పిన
గాడిదకొడు కంచుఁ దిట్టఁగా విని యయ్యో
నీఁడా నాకొక కొడుకని
గాడిద యేడ్చెంగదన్న! ఘనసంపన్నా! (మో.వెం.)

63. "గుండ్రాతికిఁ గాళ్ళువచ్చి గునగున నడిచెన్" (తి.వ.)
ఉండ్రా యోరి దురాత్మక!
ఇంద్రా ప్రాసంబు కవుల కియ్యం దగునా
యుండ్రాముపదము సోఁకిన
గుండ్రాతికిఁ గాళ్ళువచ్చి గునగున నడిచెన్. (?)

ఉండ్రాని యడవిలోపల
గుండ్రాయై యున్నయట్టి కోమలిపైఁ గో
దండ్రాముపదము సోఁకిన
గుండ్రాతికిఁ గాళ్ళువచ్చి గునగున నడిచెన్. (?)

తండ్రి పనుప మునివెంటను
పండ్రెండవయేఁట రామభద్రుఁడు చని కా

ల్గుంఢ్రించి ధూళిఁ జిమ్మిన
గుంఢ్రాతికిఁ గాళ్ళువచ్చి గునగున నడిచెన్. (?)

పంఢ్రెండుకండ్ల దేవర
తంఢ్రి శరాసనము రామధరణీశుండున్
దండింపఁ బోవునప్పుడు
గుంఢ్రాతికిఁ గాళ్ళువచ్చి గునగున నడిచెన్. (?)

64. "గుత్తపు తాపితా ఆవికకుట్టు పటుక్కున పీడె వింతికిన్" (వా.ర.)

ఇత్తఱి రమ్మురమ్మనుచు నింపుగ గొల్లలు తమ్ముఁ బిల్వఁగాఁ
దత్తరపాటునం గదిసి తాండవకృష్ణుఁడు సుందరాంగిపై
మెత్తని పూలపాన్పునను మెచ్చి చనుంగవ నంటినంతనే
గుత్తపు తాపితా ఆవికకుట్టు పటుక్కున పీడె వింతికిన్. (మో.వెం.)

అత్తఱిఁ జిత్తజుండు వి(?)రహాంగనలం గనలింప నిక్షు వి
ల్లెత్తి ధనుర్గుణంబు మెఱయించి నిశాతవినూతనప్రసూ
నోత్తమబాణపంక్తి కుచయుగ్మ మదాటునఁ దాఁక నేసినన్
గుత్తపు తాపితా ఆవికకుట్టు పటుక్కున పీడె వింతికిన్. (మో.వెం.)

65. "గుమ్మములో నున్న ముద్దుగుమ్మన్ గాంచెన్" (శ.సా.ఉ.: విశాఖపట్టణం)

కమ్మవిలుకాని చిల్కన
సమ్మద మొనరించుమన్ ప్రశస్తం బగు రీ
తి మ్మనమును గరఁపఁగఁ దా
గుమ్మములో నున్న ముద్దుగుమ్మన్ గాంచెన్. (తి.వేం.)

66. "గుజ్జానికి నైదుకాళ్ళు కోడికి నలెనే" (వా.ర.)

మజ్జాకుఁ బాన్పుగాఁ గొని
బొజ్జను బ్రహ్మాండపంక్తిఁ బూనిన ముద్దుం
గుజ్జుఁడ! విను, వన్నెలు గుహు
గుజ్జానికి నైదు; కాళ్ళు కోడికి నలెనే. (మో.వెం.)

67. "గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ - వరుసగా వచ్చేట్లు శృంగార విషయకంగా కందపద్యము" (వా.ర.)

ఒక గోల, కొండ చెంతను
బ్రకటంపు తమాలముండఁ, బటుతరగతి దా

చుక పూలదండ వేడ, నా
యకునకు మై కొత్తకుండ, నతివ రమించెన్. (?)

68. "ఘనము ఘనము మించి మించు కావలె నీవున్" (భాగవత సంబంధముగా)
విను విను వైదర్భీ! శ్రీ
వనరుహ సంవాస నీవు, వరియించుము నిన్
వనజాతనాభుఁ డయ్యున
ఘనము ఘనము మించు, మించు కావలె నీవున్. (కా.సో.)

69. "చందురులో నిట్టి వేల చంగలి మేసెన్" (వా.ర.)
కందర్పహరుఁడు నరుఁడును
బందికినై పోరి పోరి పరిపరిగతులన్
గ్రిందైన హరుని శీర్షపుఁ
జందురులో నిట్టి వేల చంగలి మేసెన్. (మో.వెం.)

70. "చట్రాతివి నారఁదీయఁ జయ్యన వచ్చున్" (తె.ప.)
ఇట్రార యుక్తి చెప్పెద
పత్రా యిది తాటిమట్ట పదిలముతోడన్
కొత్రా నీ భుజశక్తినిఁ
జట్రాతివి, నారఁదీయఁ జయ్యన వచ్చున్. (?)

71. "చుక్కలలో నొక్కనక్క సుడివడి తిరిగెన్" (తె.ప.)
చక్కన గోవర్ధనగిరి
నక్కజముగఁ గృష్ణుఁడెత్త నావుల కొఱకున్
గ్రక్కున గిరి మిన్నందిన
చుక్కలలో నొక్కనక్క సుడివడి తిరిగెన్. (?)

72. "చూతుమె లవుఁడా యటంచు సుందరి పలికెన్" (వా.ర.)
ఖ్యాతిగల రామచంద్రుఁడు
చేతోమోదంబుతోడఁ జెలఁగుచు నెంతో
ప్రీతిగ నిటు చనుదెంచిన
చూతుమె? లవుఁడా యటంచు సుందరి పలికెన్. (మో.వెం.)

సీత తన ప్రియతనూజుని
వాలియుఁ జేరంగఁ బిలిచి యౌరా యనుచున్
ఖ్యాతిగ రాముని గుఱ్ఱము
చూతుమె లవుఁడా యటంచు సుందరి పలికెన్. (?)

73. "చెలువుగఁ బిల్లిఁ బట్టుకొనఁ జేరెడి యెల్కలదండుఁ బోలెడిన్"
(చీరాల శతావధానం)

జ్వలితపు రోషవహ్ని రిపువారదవంబును నేఁడె కాల్తు నం
చలఘుబలంబుఁ జూపఁ బవనాత్మజుఁ డా రణసీమఁ జేర న
బ్బలియు నొకంటఁ గూల్తుమని పైఁబడు కౌరవసేన యయ్యెడన్
జెలువుగఁ బిల్లిఁ బట్టుకొనఁ జేరెడి యెల్కలదండుఁ బోలెడిన్. (కా.సో.)

74. "చెలువుగ రామలక్ష్మణులు సీతకుఁ దమ్ములు శంభుఁ డన్నయున్" (తె.వ.)

అలర గణింపఁ బంక్తిరథునాత్మజు లెవ్వరు? మైథిలుండు నే
లలనకుఁ దండ్రి? మన్మథుని లావు శరంబులు నేవి? కాశికా
చెలువుని నామ మెద్ది? మఱి సీరికి శౌరియు నేమి కావలెన్?
చెలువుగ రామలక్ష్మణులు, సీతకుఁ, దమ్ములు, శంభుఁ, డన్నయున్. (?)

75. "జయ జయ యంచుఁ గౌరవులు చాల విషాదముఁ జెంద నాత్మలోన్"
(విశదల శతావధానం)

భయద పరాక్రమంబునను బార్థులఁ గూర్చును భీష్ముఁ డంచు దు
ర్జయమునఁ బల్కు, కౌరవుల నాకు వశంబొకొ విల్పనంచు మే
ల్జయమగు మీ కటం చనియె సంజయుఁ డద్ది గ్రహించి యౌర! సం
జయ జయ యంచుఁ గౌరవులు చాల విషాదముఁ జెంద నాత్మలోన్.

భయదపు సింహనాదము ప్రభంజనసంభవుఁ డాచరించి టె
క్కియమునుపయి న్నటింప హరి కేల్గవఁ దట్టి నుతింపఁ బార్థుఁడ
క్షయధృతి నారి మీటఁగనె, ఘల్లుల మ్రోఁగెను వింటిగంట మేల్
జయ జయ యంచుఁ, గౌరవులు చాల విషాదముఁ జెంద నాత్మలోన్.

భయదపరాక్రమంబునను బార్థుల గెల్చును భీష్ముఁడంచు దు
ర్జయుఁడు సుయోధనుండు వదరన్ విని దానికి నోర్వలేక నే
జయమును గాంచఁ బార్థుఁ డట శాతశిలీముఖమూని దూఁకెఁ దా
జయ జయ యంచుఁ, గౌరవులు చాల విషాదముఁ జెంద నాత్మలోన్. (కా.సో.)

76. "జలము జలమ్ములోఁ గలిసి సంతమసంబునఁ గ్రమ్మె దిక్కులన్"
(సంగిడిగూడెం శతావధానం-1)

కలకలలాడు పద్మిని వికాసము వీడఁగఁ గల్వచెల్వ మేల్
కొలకొలలాడ, రేచెలి చకోరముతోఁ గనులెత్త, జక్కవల్
వలవలలాడ, నయ్యినుని బాయుట కేడ్చు దినాంబుజాక్షి క
జ్జలము, జలమ్ములోఁ గలిసి, సంతమసంబునఁ గ్రమ్మె దిక్కులన్. (కా.సో.)

77. "జారకులావతంసమును సాఁకఁదగున్ నృపతుల్ నరేశ్వరా!"
(సంగిడిగూడెం శతావధానం-1)

సారసుగంధపూరఘనసార మసార మటంచు మేటి ప
న్నీరము, కమ్మకస్తురియు నింద్యము లంచు, సుగంధబంధురం
బై రమణీయమౌ పునుఁగు నద్భుతభంగి సృజించు గంధమా
ర్జారకులావతంసమును సాఁకఁదగున్ నృపతుల్ నరేశ్వరా! (కా.సో.)

78. "దద్ధ్వనమున నిట్టిదనుచుఁ దగుఁ దెలియంగన్" (విశదల శతావధానం)

సద్భజనీయం బియ్యది
యద్భుతమే శాణమునకు నగు సాన యనన్
సద్ధ్వనంబులఁ గావునఁ
దద్ధ్వనమున నిట్టిదనుచుఁ దగుఁ దెలియంగన్. (కా.సో.)

79. "దల లొక్కేఁబది నాల్గు కానఁబడియెన్ దద్గౌరివక్షంబునన్" (చా.ర.)

లలితాకారుఁ గుమారు షణ్ముఖునిఁ దా లాలించి చన్నిచ్చుచో
గళలగ్న గ్రహరత్నదీప్తకళికా గాంభీర్య హేమాంచితో
జ్జ్వల రత్నప్రతిబింబితాననములన్ శంభుండు వీక్షింపఁగాఁ
దల లొక్కేఁబది నాల్గు కానఁబడియెన్ దద్గౌరివక్షంబునన్. (మో.వెం.)

80. "తలకాయల పులుసుఁ ద్రావి తనిసిరి బాపల్" (తె.వ.)

పలుకూరి దేవళంబున
సలలితముగ మొన్నఁ జేయు సంతర్పణకున్
దొలుతను మీ రంపిన చిం
తలకాయల పులుసుఁ ద్రావి తనిసిరి బాపల్. (?)

81. "తలలోపలనున్న కల్లుఁ ద్రావి రనేకుల్" (బాపట్ల శతావధానం)

బలువేసవి దినములలోఁ
గలిగిన తాపంబు దీఱఁగా నుత్సాహం
బొలయఁగఁ గడుఁజల్లని ముం
తలలోపలనున్న కల్లుఁ ద్రావి రనేకుల్. (కొ.సో.)

82. "తల్లి తల్లి మగఁడు తల్లియయ్యె" (బాపట్ల శతావధానం)

మోహినీ స్వరూపమున నొప్పు హరితోడ
భవుఁడు కలయఁ బుట్టె భైరవుండు
దాన భైరవునకుఁ తండ్రియయ్యె శివుండు
తల్లి తల్లి మగఁడు తల్లియయ్యె. (కొ.సో.)

83. "తల్లి మగండు తండ్రియని తల్పక కూడియు సాధ్వియయ్యెఁగా!"
(విశదల శతావధానం)

తల్లి ధరిత్రి సీతకు యథార్థము, శ్రీహరి యా ధరిత్రికిన్
వల్లభుఁడయ్యె, నాహరియు వల్లితలీలను రాముఁ డయ్యె, నా
హల్లకపాణి సీత విభుఁడై తగు రాముని యోగ్యవేళలన్
తల్లి మగండు తండ్రియని తల్పక కూడియు సాధ్వియయ్యెఁగా! (కొ.సో.)

84. "తొడియుందము చెప్పఁదరమె? తోయజనేత్రా!" (శ.సా.పూ.: ధవళేశ్వరం)

వడివడి పనియున్నప్పుడు
పాడుమొక్కక మిగుల విసుగు పుట్టించును నీ
గొడవొకటి లేకయుండినఁ
దొడియుందము చెప్పఁదరమె? తోయజనేత్రా! (తి.వేం.)

85. "తొలిఁజేసెన్ భయమింతయున్ గనక విద్యుద్వల్లి వ్రబంబహో"
(బాపట్ల శతావధానం)

తళుకుం జూపులు సోగకన్నులును మందంబైన యానంబునున్
గులుకుం గుబ్బలు బారలౌ కురులు బెళ్కుం జూపు మధ్యంబునున్
వెలయన్ నల్వ స్మరాస్త్రమే మెయి యనన్ బింబోష్ఠి నిర్మించి తాఁ
దొలిఁజేసెన్ భయమింతయున్ గనక విద్యుద్వల్లి కబ్రంబహో. (కొ.సో.)

86. "తోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగు చాడ్పునన్" (చా.ర.)

(రామాయణార్థమున)

తోఁచకపట్టి తెమ్మనుచుఁ దొయ్యలి వేడిన వెంటనంటి చే
సాచుచు మెల్లమెల్లఁగను జాడల జాడల నాశలాశలన్
వాచకవచ్చు రామరఘునాయకు ముందర మాయలేడి తాఁ
తోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగు చాడ్పునన్.(మో.వెం.)

(రామాయణార్థములోనే మరో విధంగా)

"పేచ మడంచి రాఘవకపిప్రవరాదులు వాల్మగంటిమిన్
ఏఁచఁగ మిన్ను మన్ను దిశ లెచ్చటి వచ్చటఁ గాలఁగా రవిం
గ్రాచు శరాగ్నికీలల జగంబులు ఘూర్ణిల నింద్రజిత్తు తాఁ
దోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగు చాడ్పునన్.

(దానినే భాగవతార్థమున)

పూచిన మాట పట్లఁ దలపోయఁగలేక మనోభవుండు ప్రే
రేచ గణాలు వాలుఁ గను రెప్పల వార్పక చూడఁగా మనం
బాచఁగలేనియట్టి త్రిపురారి పురస్థలి శౌరి నారియై
దోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగు చాడ్పునన్.

87. "త్రుంచెన్ రామశిరంబు రావణుఁడు సంతోషించి రావిర్జరుల్"

(గుంటూరు శతావధానం)

ఎంచన్ సీతకు మాయసీతఁ దగున ట్లేర్పాటు గావించి తాఁ
ద్రుంచెన్ శక్రజితుం డటం చనిన దైత్యుం డిష్టుఁడై యున్నఁ ద
ద్భ్రంచద్రత్నకిరీట మూడిపడఁ గీశానీక మౌనౌ నసం
ద్రుంచెన్ రామ, శిరంబు రావణుఁడు సంతోషించి రావిర్జరుల్. (కొ.సో.)

88. "దారము లేకున్న బ్రతుకఁ దరమే ప్రజకున్?" (గుంటూరు శతావధానం)

క్రూరుఁడగు కనకలోచను
మారణ మొనరించి ధరణి మనుపఁగ హరి భూ
దారమయి యొప్పె; నా భూ
దారము లేకున్న బ్రతుకఁ దరమే ప్రజకున్? (కొ.సో.)

89. **"దారము లేని హారము వితంబిది! నీకెవఁడిచ్చెఁ జెప్పుమా?"** (వికరల శతావధానం)
చారుపటీరచర్చ కలశద్వితయోపమమౌ కుచద్వయిన్
మీఱఁగ నొక్క పూరుషుని మెచ్చి కవుంగిటఁ జేర్చి తౌట నా
పూరుషుపేరు ముత్తెములఁ బోల్పగు గుర్తులు నిల్చెఁ గానిదో
దారము లేని హారము వితంబిది! నీకెవఁడిచ్చెఁ జెప్పుమా? (కొ.సో.)

90. **"దిరిగిరి సత్పథం బెనసి తేజరిలెన్ విబుధాళి కిక్కలై"** (గుంటూరు శతావధానం)
గరువము మీఱు వింధ్యమున కంటె సమర్థతఁ జూపఁ బూనఁగా
హరుని శరాసనం బను మహత్త్వపుఁ గల్మిని రత్నకూటముల్
మెఱయు సువర్ణసంపదల మేకొన నిర్జరులెల్ల మోద మం
దిరి గిరి సత్పథం బెనసి తేజరిలెన్ విబుధాళి కిక్కలై. (కొ.సో.)

91. **"దీపముపై నొక్క యీఁగ ధీరత వ్రాలెన్"** (చీరాల శతావధానం)
భూపాలు కేళిగృహమున
దీపముకై శోణమణులు దీపింప దురా
శాపటిమఁజేసి తన్మణి
దీపముపై నొక్క యీఁగ ధీరత వ్రాలెన్. (కొ.సో.)

92. **"దుగ్ధపయోధిమధ్యమున దుమ్ములు రేఁగె నిదేమి చోద్యమో!"** (చా.ర.)
స్నిగ్ధపువర్ణుఁ డీశ్వరుఁడు చిచ్చుఱకంటను బంచబాణునిన్
దగ్ధము చేసె నంచు విని తామరసేక్షణు ప్రోలనున్న యీ
ముగ్ధపు లచ్చి మోదుకొనె: మోహనగంధము పిండిపిండియై
దుగ్ధపయోధిమధ్యమున దుమ్ములు రేఁగె నిదేమి చిత్రమో! (మో.వెం.)

93. **"దుర్మతి రాజుగాఁగఁ బరితోషము గైకొని రెల్లవారలున్"** (బాపట్ల శతావధానం)
దుర్ముఖియందె పుట్టియును దుర్ముఖిగాక ప్రజానురాగుఁడై
కర్మఠుఁడైనయట్టి నరకాంతుని పుత్రుఁడు రౌద్రివత్సరం
బర్మిలి నిండినంతఁ దగునంతటి ప్రాయముగల్గి మేటియై
దుర్మతి రాజుగాఁగఁ బరితోషము గైకొని రెల్లవారలున్. (కొ.సో.)

94. **"దృఢసత్వంబునఁ జీమ తుమ్మెఁగదరా దిగ్దంతు లల్లాడఁగన్"** (చా.ర.)
పడులీశోర్వి చలింప, నిర్జరవరుల్ శంకింప, భేరీనికా
యఢమత్కారత నిద్రలేచి దశకంఠామర్త్య విద్వత్పరీ

వృథ సోదర్యుఁడు లేచి రా, వృథ యొనర్చెన్ నాసికాంతస్స్థమై
దృఢసత్త్వంబునఁ జీమ; తుమ్మెఁగదరా దిగ్దంతులల్లాడఁగన్. (మో.వెం.)

(పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం)

ప్రఢిమ న్మీఱిన పాండుపుత్రుల మహాస్త్రప్రౌఢులన్ రాత్సరీ
వృథలోకాద్భుతవిక్రమక్రముల నాఁపెన్ సైంధవభ్రష్టుఁ డా
దిధులీంద్రోపములైన, నీశ్వరవరాధిక్యంబునం జేసి, హా!
దృఢసత్త్వంబునఁ జీమ తుమ్మెఁగదరా దిగ్దంతులల్లాడఁగన్! (కొ.సో.)

95. "దోగ్ధ్రీ ధేనువు గర్భమందుఁ బులికందుల్ పుట్టె నుగ్రాకృతిన్" (వా.ర.)
దోగ్ధ్రీశాంత తపోదయా! గుణానిధీ! తేజస్వి! పాపాటవ
దగ్రాక్షానలుఁడైన కశ్యపున కుద్యద్గర్వులై యాగభు
గ్విద్విషుల్ సుతు లుద్భవించిరి బిడౌజా! వింత వీక్షించితే
దోగ్ధ్రీ ధేనువు గర్భమందుఁ బులికందుల్ పుట్టె నుగ్రాకృతిన్. (మో.వెం.)

96. "ధారము లేని హారము వితంబిని! నీ కెవఁడిచ్చెఁ జెప్పుమీ" (వా.ర.)
భూరి వివేకులౌ విటులఁ బూఁబోదరింఢ్లను గూడి వారిచేఁ
గోరిన భూషలెన్నొ కొని కోమలి ధారిణివైతి వందులో
హారము లుల్లసిల్లఁగ మహీప్రవరుల్ వినుతింపఁ బచ్చలా
ధారము లేని హారము వితంబిని! నీ కెవఁడిచ్చెఁ జెప్పుమీ. (మో.వెం.)

97. "నవరాత్ర వ్రతదీక్ష చెల్లెనిట నానందం బమందంబుగన్"

(పంగిడిగూడెం శతావధానం-1)

కవిరాజుల్, బుధరాజు, లుత్తమధరాకాంతుల్, హితుల్, బాంధవుల్
సవనంబంచు గణింప, నిర్మల నయస్వాంతంబునన్, దేవి, రా
ఘవమాంబామణితోడ నాగవసుధాకాంతుండు పూజింప శ్రీ
నవరాత్ర వ్రతదీక్ష చెల్లె నిట నానందం బమందంబుగన్. (కొ.సో.)

98. 'నావాఁటికిఁ దీపికట్లు నాగంభట్లూ" (పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)
ఏ నెట్లు సేతుఁ గాఁపుర
మీ నాతుకతోడ బుద్ధి యేర్పడ దయ్యో!
పూనిక నే నెట్లోర్చిన
నావాఁటికి దీపికట్లు నాగంభట్లూ. (కొ.సో.)

ఏనాఁటి యగ్రహారము
మీ నాఁటికి మాన్యమాయె, మీపని తీఱన్
మానాఁడు ఖండ్రికాయెను
నానాఁటికిఁ దీసికట్టు నాగంభట్టా. (చాటువు)

99. "నిను నిను నిన్ను నిన్ను మఱి నిన్నును నిన్నును నిన్ను నిన్నునున్" (చా.ర.)
(రామాయణార్థంలో)

అనిలజ! జాంబవంత! కమలాప్తతనూభవ! వాయుపుత్ర! యో
పవన! సుషేణ! నీల! నల! భానుకులుం డగు రాఘవేంద్రుఁ డ
ద్దనుజపురంబు వేగెలున దైత్యులఁ జంపఁగ వేగ రమ్మనెన్
నిను నిను నిన్ను నిన్ను మఱి నిన్నును నిన్నును నిన్ను నిన్నునున్. (మో.వెం.)

(భాగవతార్థంలో)

అనఘ సురాపగాతనయ! యర్కతనూజ! విచిత్రవీర్యనం
దన! గురుపుత్ర! ద్రోణ! కృప! నాగపురీశ్వర! దుస్ససేన! ర
మ్మనుమనె రాజసూయము యమాత్మజుఁ డిప్పుడు చేయఁబూని, తా
నిను నిను నిన్ను నిన్ను మఱి నిన్నును నిన్నును నిన్ను నిన్నునున్. (మో.వెం.)

(భాగవతార్థంలో)

అనఘ సురేశ! వాయుసఖ! యర్యమనందన! రాక్షసేంద్ర! యో
వనవిధినాథ! గంధవహ! వైశ్రవణా! నిటలాక్ష! తాను ర
మ్మనుమని చెప్పె మాధవుఁడు మారుని పెండ్లికి మిమ్ము నందఱన్
నిను నిను నిన్ను నిన్ను మఱి నిన్నును నిన్నును నిన్ను నిన్నునున్. (మో.వెం.)

100. "నిప్పున నాక చేరెఁడంత నెత్తురు గాఱెన్" (చా.ర.)

కుప్పించి వెలుఁగు దూఁకిన
గొప్పము లిదె నాటె నిపుడు, కోమలి వేగన్
ఉప్పుఁ గొనిరమ్ము, కాతము
నిప్పున; నాక చేరెఁడంత నెత్తురు గాఱెన్. (మో.వెం.)

101. "నిలువుటద్ద మెదుట నిలిపి చూపితిఁ గాని
పలుకెంపు లేమని పలికినావ?
పసమీఁగుదుప్పటి పైఁ గప్పితిఁ గాని
పసపూరంగేమని పలికినావ?
విరులసురటి దెచ్చి విసరుచుంటిని గాని" (శ.సా.పూ., కాకినాడ)
చెమ టదేమని పృచ్ఛ చేసినావ?
పవళింప విరిపాన్పు సవరించితిని గాని
యాయాస మేమని యడిగినావ?
మొగము వెలవెలఁబోయిన మూలమేమి?
యెఱుపు గనులందుఁ గల్గిన హేతువేమి?
నాథ! నాయందు లోపమున్నను క్షమింపఁ
బాడి యగుఁగాక తప్పులు పట్టఁ దగునె? (తి.వేం.)

102. "నీవ్రతమాచరించెదను నీటుగ నన్ను ననుగ్రహింపుమా"
(సంగంజాగర్లమూడి శతావధానం)
ధీవ్రజ వర్ణనీయ రుచిదీప్త యశోవిభవాభిరామ! ము
గ్ధవ్రజకామినీ కుసుమకాండ! జనార్దన! కృష్ణ! మాధవా!
సువ్రత మంద్రు ద్వాదశిని మారులు నీ కొపుడిష్టమౌట నా
నీవ్రతమాచరించెదను నీటుగ నన్ను ననుగ్రహింపుమా. (కొ.సో.)

103. "మాఱున్ముప్పదియాఱుకన్ను లమరెన్ రుద్రాణి వక్షంబునన్" (వా.ర.)
రారమ్మంచుఁ గుమారు నంకమునయున్ రంజిల్లఁగా నుంచి వి
స్తారోద్యద్ఘనవక్త్రపంచకముతో శంభుండుఁ దత్కాంతయున్
ఆరూఢిన్ నవపంచరత్నపతకం బాలోకనం జేయఁగా
మాఱున్ముప్పదియాఱు కన్నులమరెన్ రుద్రాణి వక్షంబునన్. (మో.వెం.)

104. "నెలఁజూపించి లతాంగి యేడ్చెనఁట! కన్నీరొత్తుచుం బయ్యెదన్"
(శ.సా.ఉ., లక్ష్మీనరసాపురం)
కలికిన్ రంభను రావణాసురుఁడు దుష్కామంబుమైఁ బట్టి వ
న్నెలు మీఱం దమకించి యా పిదప దానిన్ గోరులం గ్రుచ్చఁగన్
బొలుపుం బాయుచు నామె యా ధనదసూనుం గాంచి యచ్చోటి క్రొ
న్నెలఁ జూపించి లతాంగి యేడ్చెనఁట! కన్నీరొత్తుచుం బయ్యెదన్. (తి.వేం.)

105. "నెలబాలను జూచి బాల నెలబాలాయెన్" (తె.ప.)

కలికీ! శిశు వెన్నాళ్లది?
నెలకొని వివరింతు, రేపు నెలపాడుపు గదే,
చెలి పీళ్ళాడఁగ మునుపటి
నెలబాలను జూచి బాల నెలబాలాయెన్. (?)

106. "పంద్రం గిక్కడి కెంతదవ్వొ చెపుమా, పంకేజపత్రేక్షణా!" (శ.సా.ఉ., విశాఖపట్టణం)

గుంద్రా కావలి నంచు నే నడుగ నాకుం బల్లెవా రందఱున్
బంద్రంగిం గల దంచు జెప్పి రది నాభావమ్ములో నెంచి యు
వ్వాంద్రన్ మెచ్చుచు దానిఁ గొంటకయి యీ ప్రాంతస్థలిన్ జేరితిన్
బంద్రం గిక్కడి కెంతదవ్వొ చెపుమా, పంకేజపత్రేక్షణా! (తి.వేం.)

107. "పందే నా కిష్ట మనుచు బాపఁడు పలికెన్" (తె.ప.)

పొందూర నొక్క విప్రుని
విందుకు రాఁ బిలిచి నీకు వేడుకతోడన్
ఇందెందు విష్టమనఁ బ
ప్పందే నా కిష్ట మనుచు బాపఁడు పలికెన్. (?)

108. "పద్మంబున కోడి చేరెఁ బద్మారి దివిన్" (బాపట్ల శతావధానం)

పద్మవ్యూహము విప్రక
కుద్మంతుఁడు గూర్ప నడపఁగోరెద రంచున్
బద్మారియైన వ్యూహపు
బద్మంబున కోడి చేరెఁ బద్మారి దివిన్. (కొ.సో.)

పద్మములు విలోచనములు
పద్మపుముకుళములు చనులు పద్మాక్షికి నా
పద్మాక్షి సుందరానన
పద్మంబున కోడి చేరెఁ బద్మారి దివిన్. (కొ.సో.)

109. "పనులు గావు పొంతపనులు గావె" సీసములో

(పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

బెడఁగైన దంతపు బీరువా లిప్పి మ
ద్రాసు శిల్పులకుఁ జిత్రము ఘటించు

మర్దళవీణాది మహిత వాద్యము లివి
సకలగాయకుల సంస్తవము నొందు
దృఢపరికరములౌ యినుపపెట్టియ లివి
సీమదొరల మెప్పుఁ జెందఁజేయు
రమ్యంబులగు నీలిమ్రాను కుర్చీ లివి
బొంబయివారి కబ్బురముఁ గూర్చు
పద్మభవునకేనిఁ బ్రతిసెప్ప నొప్పు శ్రీ
నారసింహన్నపుఁ డొనర్చె నవ్వి
యన్యదేశశిల్పు లరుదెంచి చేసిన
పనులు గావు, సొంతపనులు గాక. (కొ.సో.)

110. "పరకాళాకుట్టు ఆవికె ఫక్కున పగిలెన్" (తి.వ.)

పొరుగూరు పోయి వచ్చిన
యరుదగు తనమగనిఁ జూచి యతిమోదముతో
గరిపాడిచి గుబ్బ లుబ్బిన
పరకాళాకుట్టు ఆవికె ఫక్కున పగిలెన్. (?)

111. "పశ్చిమదిశ రవియు మనుజా పొసయు నుండెన్" (గుంటూరు శతావధానం)

ఆశ్చర్యమేమి పలుపురు
పశ్చిమమునఁ జూడఁ దూర్పుపట్టునఁ గూడన్
నిశ్చయముగ ననుకొన నటు
పశ్చిమదిశ రవియు మనుజా పొసయు నుండెన్. (కొ.సో.)

112. "పసిఁడిపళాకు తీఁగెకును పర్వతముల్ వికసించి నవ్వఁగన్" (చా.ర.)

విసువక పల్లవాళిఁ దివి వేద్యఁ బికంబులు మ్రోయుఁగా, వసం
తసమయహేమకారకుఁడు తద్దయు వేడుక భూషణంబులన్
బస వనలక్ష్మిఁ గూర్చుకొనె; భాసిలు పంపఁగిపూవుపేరి మే
ల్పసిడిపళాకు తీఁగెకును పర్వతముల్ వికసించి నవ్వఁగన్. (మో.వెం.)

113. "పాతరలో సూర్యుఁ డుదయపర్వతమెక్కెన్" (చా.ర.)

ఈతతిఁ గాపులఁ బిలువుఁడు
రాతిరి ప్రొద్దెల్ల జాతరాయెను ధాన్యం
బాతురముగఁ బోయింతము
పాతరలో, సూర్యుఁ డుదయపర్వత మెక్కెన్. (మో.వెం.)

114. "పాదమ్ములు లేని తరులు పరుగిడఁ జొచ్చెన్" (శ.సా.ఉ., విశాఖపట్టణం)

ఏదెస వానలు గురియన్
గోదావరి పొంగివచ్చి గుములుగ నందున్
వే దొరలి నీట దృఢతర
పాదమ్ములు లేని తరులు పరుగిడఁ జొచ్చెన్. (తి.వేం.)

115. "పాపటకాయలోన నొక బాలుఁడు సింగము వేఁటలాడెడిన్" (తె.ప.)

ఏపున మేము కొందఱము ఏనుఁగువైరుల వేఁటఁ బోవఁగా
కూపముభంగి నున్న దొక కొండబిలం బది చొచ్చిపోవఁగా
దీపముభంగి నున్న దొక దివ్యపురత్నముఁ దెచ్చి మింతి నీ
పాపటకాయలోన నొక బాలుఁడు సింగము వేఁటలాడెడిన్. (?)

116. "పాముపడగనీడ నెలుక బాగుగఁ బండెన్"(పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

భీమమగు జాతివైరం
బేమాత్రము లేక మైత్రి యిమ్ముగ విష్ణు
స్వామి పదాభరణం బగు
పాముపడగనీడ నెలుక బాగుగఁ బండెన్. (కొ.సా.)

117. "పాలకుండ, గోలకొండ, మాలముండ, పూలదండ - వరుసగా వచ్చేట్లు రామాయణార్థంలో మత్తేభం" (చా.ర.)

బలవద్రాక్షసపాలకుండ వనుచుం బాటింప కా గోల కొం
డల చెట్లందు చరించువేళ మగనిం దప్పించితే! నీతియే?
ఖలుఁడా! నీవిటు పొంచి నైచులటు; నా కంజాక్షి నీ మాల ముం
డలలో నుంచినఁ బూలదండ కడు నెండన్ వాడినట్లుండదే? (?)

118. "పున్నమ యమవస యనంగఁ బొల్పొందె భువిన్" (బాపట్ల శతావధానం)

అన్నా పున్నమ లెన్నియొ
కన్నుల పండువును జేయఁగా ఘనతిమిర
చ్ఛన్నమయి వ్యాసుపేరిటి
పున్నమ యమవస యనంగఁ బొల్పొందె భువిన్. (కొ.సా.)

వెన్నెల వెదఁజల్లుచు దివి
వెన్నవలెన్ దోఁచు చంద్రబింబము నెల్లన్

గ్రవ్వన రాహువు ప్రింగఁగఁ
బువ్వమ యమునప యనంగఁ బొల్చెంది భువిన్. (కొ.సో.)

119. "పులు లావులు గూడి యొక్క పొలమున మెలఁగెన్" (తె.ప.)

చెలువుగ విశ్వామిత్రుని
యలఘుతపోమహిమ నతని యాశ్రమమందున్
బలుసింగము లేనుంగులు
పులు లావులు గూడి యొక్క పొలమున మెలఁగెన్.

120. "పుష్పాస్త్రుం డెవఁ, డేమిసేయు, జననీ! పూజ్యాత్మవై యుండుమీ!"
(సంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

దుష్పాండిత్యపువాద మేల? కృపఁ బుత్రు న్నీడుమా నన్ను, నా
ప్రాప్యత్యున్నతు లెన్నియున్నఁ దుదకున్ బూదింబడున్ దేహ, మా
నిష్పాపోపమితంబు దుష్టజగతిన్ జిత్రాంగి నా నోర్చెదే?
పుష్పాస్త్రుం డెవఁ, డేమిసేయు?, జననీ? పూజ్యాత్మవై యుండుమీ. (కొ.సో.)

121. "పూవుంగుత్తులు సోకినంతఁ గమలెన్ బొందమ్మిక్రొంబూసరుల్"
(సంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

దేవేంద్రాత్మజుపై విరాళిఁ గడుమద్దీపించు కామాగ్ని నా
పావక్రంబు మహేంద్రనీల మగుటన్ శైత్యక్రియల్ సల్పుచో
గోవిందానుజ మేనుఁదీవ సొబగుల్ గొల్పించు వక్షోజపుం
బూవుంగుత్తులు సోకినంతఁ గమలెన్ బొందమ్మిక్రొంబూసరుల్. (కొ.సో.)

122. "పృథ్విన్ సాధ్వి సదర్థ్వచారులను మెప్పించున్ యశంబున్ గొనున్"
(సంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

ఆ ధ్వాంతాపహరుల్ దిశాపతులు భూమ్యాకాశముల్ స్తోత్రశ
బ్దధ్వానంబులతో సతీత్వ మెఱిఁగింపం బంక్తికంఠాసురేం
ద్రధ్వంసిన్ ముదితాత్ముఁ జేసికొను సీతాకాంత చందంబునన్
బృథ్విన్ సాధ్వి సదర్థ్వచారులను మెప్పించున్ యశంబున్ గొనున్. (కొ.సో.)

123. "ఫలము దినందగునె చూతఫలముం బోలెన్?"
(దమయంతీ కథ: బాపట్ల శతావధానం)

నలనామ మొనర మ్రగా
నలుని వరింపంగ నెట్లు నా కొనఁగూడున్

ఫలమనిన మాత్ర ముక్తా
ఫలముఁ దినందగునె చూతఫలముం బోలెన్?" (కొ.సో.)

124. "ఫలములఁ గొమ్ము, పోపునిఁకఁ జైత్యము, వైద్యము లేల విప్రుఁడా"
(పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-1)

వెలఁగల లోఁదలంపక వివేకవిహీనత దేవదేవు కో
వెలఁగల వస్తు లమ్ముకొని వేలకు మందులు గొంటి, వన్నియున్
వెలఁగలఁ బోలఁజాల వరపీసము గావున మన్మథాగ భూ
ఫలములఁ గొమ్ము, పోపునిఁకఁ జైత్యము, వైద్యము లేల విప్రుఁడా? (కొ.సో.)

125. "బంగ్లాలోనికి దారియెద్ది? చెపుమా? బాలా! కురంగేక్షణా!"
(పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

ఆంగ్లం బందు మనోజ్ఞవైఖరి నుపన్యాసంబులన్ సల్పఁగా
వాంగ్లేయప్రభుఁడెంచి పిల్వఁగ సహాధ్యాయుండు ముందేగె, నెం
దుం గ్లాంతిం గనకుండఁ దోడ్పడఁగ నేనుం బోదు, వారున్న యా
బంగ్లాలోనికి దారియెద్ది చెపుమా, బాలా! కురంగేక్షణా! (కొ.సో.)

126. "బకమున్ పడి మ్రింగుచున్న బల్లిం గనుమా!" (శ.సా.పూ., కాకినాడ)

ప్రకటతర కప్పగంతుల
సుకులోదధి పూర్ణచంద్ర! సూరిజనేంద్రా!
సుకరముగ మక్షికాళా
బకమున్ పడి మ్రింగుచున్న బల్లిం గనుమా! (తి.వేం.)

127. "బడబానల పంక్తిమీఁద పచ్చిక మొలచెన్" (చా.ర.)

పడఁతిరో! నవమేఘంబులు
విడిఁబడి జడి ముసురుపట్టి విలయపువానల్
గడుఁ గొట్టి కురియ, గోడలు
బడ, బానల పంక్తిమీఁదఁ బచ్చిక మొలచెన్. (మో.నం.)

128. "బిగివను లేతమాడఁగను బియ్యము దంచె లతాంగి వేఁడుకన్"
(శ.సా.ఉ., విశాఖపట్టణం)

అగణితమైన వేగమున నట్టిటు వంగుచు లేచుచున్ ఘనం
బుగఁ దగురీతిఁ బాటలను బొల్పుగఁ బాడుచు "సువ్విసువ్వి" యం

చాగి ముసలమ్ము కేలఁగొని యూఁగుచు జోగుచు, తొమ్ముగొట్టుచున్
బిగిచను లేతమాడఁగను బియ్యము దంచె లతాంగి వేడుకన్. (తి.వేం.)

129. "బుద్ధమతావలంబనులు పూజలు సల్పిరి విష్ణుమూర్తికిన్" (విశదల శతావధానం)
బుద్ధుఁ డనంగ విష్ణుఁ డొక పూజ్యతరంబగు పేరుగాంచె మున్
సిద్ధము వానిదే మతముఁజెందుటఁజేసి యభీష్టసిద్ధిగా
బుద్ధిఁ దలంచి మేలనుచుఁ బొల్పగు నొక్క దినంబునందు నా
బుద్ధమతావలంబనులు పూజలు సల్పిరి విష్ణుమూర్తికిన్. (కొ.సో.)

130. "భల్లూకముకడుపులోన భానుఁడు గ్రుంకెన్" (తి.ప.)
అల్లంత ప్రొద్దుకాడను
విల్లందుక వేటకాఁడు వేయఁ దొడంగెన్
జిల్లంపకోల, చిక్కెను
భల్లూకముకడుపులోన, భానుఁడు గ్రుంకెన్. (?)

131. "భామాకుచమండలంబు భస్మంబాయెన్" (తి.ప.)
కామాతురుఁడై జంగము
ప్రేమంబున బూతిఁ బూసి ప్రియ మలరంగాఁ
గామించి కౌఁగిలించిన
భామాకుచమండలంబు భస్మంబాయెన్. (?)

132. "భార్య బిడ్డలు శ్రీరామభద్రునకును" (చా.ర.)
రావణుని సంహరించియు రాజ్యమునకు
నంగనయుఁ దాను నభిషిక్తుఁడై వెలుంగ
హార తిచ్చిరి ప్రేమతో హరునిముద్దు
భార్య బిడ్డలు: శ్రీరామభద్రునకును. (మో.వెం.)

133. "మంచాలన్ బిగియించె గుంజలకు నమ్మా బిందియన్ దేఁగదే!"
(శ.సా.ఉ., గుంటూరు)
"కుంచాలన్ గొలిపించి యిచ్చితివిగా గుగ్గిళ్ళకై యుల్వలన్
గంచాలం దిడఁబోకు మన్న మిపు డెక్కన్బోదు సంసారి పా
వంచాలం డిగి దప్పిగొన్నవిర, సుబ్బా! నీళ్ళు వేవేగఁ దె
మ్మం" చాలన్ బిగియించె గుంజలకు నమ్మా బిందియన్ దేఁగదే. (తి.వేం.)

134\. "మంచాలన్ బిగియించె గూటముల కమ్మా బిందియం దేఁగదే"
(గుంటూరు శతావధానం)

కంచున్నింపుము దోఁపఁ బాలకయి యాగం బియ్యెడన్ బాలకుల్
కొంచెం బాగక చేయుచుండి రిటఁ బాలుం దీయఁ బ్రొద్దేఁగె నే
ఱెంచన్ రా దివు, దాలకాఁపరియుఁ దానేతెంచె, యాలస్యమే
మం చాలన్ బిగియించె గూటముల, కమ్మా బిందియం దేఁగదే. (కొ.సో.)

135\. "మందారముఁ జూడనెంతురె ఘనంబగునట్టి గులాబిముందరన్"
(శ.సా.ఉ., రాజమంద్రి)

ధీరతగల్గి చక్కనగు తెల్వియుఁదేటయుఁబొల్చి మేల్మి బం
గారము రీతిగాఁ గవిత కల్పనచేసెడివార లుండ శు
ష్కోరుతరోక్తులన్ గొనఁగ నొప్పుదురే సుకవీంద్రు లెందు మం
దారముఁ జూడనెంతురె ఘనంబగునట్టి గులాబిముందరన్. (తి.వేం.)

136\. "మతిలేనినరుండు మిగుల మన్నన వొందున్" (చా.ర.)

హిత మాచరించువారికి
హిత మొనరించుచును సుజనహితుఁ డగుచును దు
ష్కృత మెప్పుడుఁ జేయను సం
మతిలేనినరుండు మిగుల మన్నన వొందున్. (మో.వెం.)

137\. "మరుఁ దుగ్రక్రుధఁ దాఁకె శైవవరసామర్థ్యంబుచే శ్రీహరిన్"
(వంగిడిగూడెం శతావధానం-1)

హరిపౌత్రుం డనిరుద్ధుఁ డం చెఱుఁగ కాహో! బాణదైత్యాధముం
డురుదర్పోద్ధతిఁ బట్టెఁ, బౌత్రకుఁ, దదీయోదగ్రదర్పాంధ్య మే
పఱ శిక్షింపక మాననంచు హరి రా నవ్వేళ నాబాధితా
మరుఁ దుగ్రక్రుధఁ దాఁకె శైవవరసామర్థ్యంబుచే శ్రీహరిన్. (కొ.సో.)

138\. "మరుఁడు దానఁ జూపె యముఁడు కింకరులఁ జూపె" (చా.ర.)

భరతకులవీరుఁ డయినట్టి పాండురాజు
మాద్రిపై దృష్టిఁబఱపిన మగువ యంత
వలదు వల దని వారింప వాంఛగదియ
మరుఁడు దానఁ జూపె యముఁడు కింకరులఁ జూపె. (మో.వెం.)

139. "మజ్జాకున విడెము సేయ మనసాయె గదే" (తె.ప.)

కొజ్జన్నము ఘృతసూపము
బజ్జిలపెరుఁ గూరగాయ పచ్చడి తోడన్
బొజ్జగ భోంచేస్తిమయా
మజ్జాకున విడెము సేయ మనసాయె గదే. (?)

140. "మా కులదాస! యెంత యభిమానము లేదుర? చంద్రశేఖరా!"
(శ.పా.పూ., కాకినాడ)

"నాకు విభూతిరాయఁ డొక నాయకుఁడా?" యని నీదు భార్య ర
త్నాకరు చెట్టపట్టు టది యారసియుండియు, సిగ్గులేక ర
త్నాకరుఁ జంకఁ బెట్టుకొని యుక్కులటన్ దలఁదాల్చి తౌర! భా
మా కులదాస! యెంత యభిమానము లేదుర చంద్రశేఖరా! (తి.వేం.)

141. "మాద్రియు దోస్త్రుతం గనె హిమాద్రియుఁ దర్దక మయ్యె నయ్యెడన్"
(చీరాల శతావధానము)

క్షుద్రపువ్యాధి లోకములఁ జొచ్చి చికాకును జేయుచుండఁగా
భద్రము విచ్చు నోషధు లపారముగాఁ గొన ధేనువయ్యె వి
ర్నిద్రగతిన్ వసుంధరయుఁ బ్రేముడి నా పృథునామ ధైర్యహే
మాద్రియు దోస్త్రుతం గనె, హిమాద్రియుఁ దర్దక మయ్యె నయ్యెడన్. (కొ.సో.)

142. "మానవతీలలామ కభిమానమె చాలును జీర యేటికిన్" (శ.పా.పూ., ఏలూరు)

ఓ నవనీతచోర! కృపయుంచి పటమ్ముల నిచ్చి వేగ మా
మానము గావు మన్న వ్రజమానిని పల్కుల కెంతొ వింతవ
వ్వానవసీమఁ దోఁపఁ గమలాక్షుఁడు దానిటు పల్కె, మానినీ!
మానవతీలలామ కభిమానమె చాలును జీర యేటికిన్? (తి.వేం.)

143. "మామిడి నిలువెల్లఁబూసి మారే డాయెన్" (తె.ప.)

కోమలి నూతనవేళను
చీమలు పదికోట్లు గూడి చిందులు ద్రొక్కన్
మామా! మామిడి పూసెను
మామిడి నిలువెల్లఁబూసి మారే డాయెన్. (?)

**144. "మాయాతి, నాయాతి, నయాతి, యాతి - అను పదములు వరుసగా నాల్గు చరణములలో నొక్కొక్కటిగా నిమిడ్చి కృష్ణపరముగా"** (విశదల శతావధానం)

మాయాతి స్థిరవృత్తిఁ గృష్ణుఁడన దుర్మానారి మీనవ్రజా
నాయాతి స్ఫుటశక్తిఁ జూపి తనరెన్ నారాయణుం డాతఁ డో
యాయుష్మంతుఁడ తా నయాతిమతిన నాయ్యాద్యుం బరుం గొల్చినన్
శ్రేయం బబ్బు జయాతి కీర్తిగరిమం బెందు న్నరుం డెయ్యెడన్. (కా.సో.)

**145. "మార్తాండుం డపరాద్రిఁ గ్రుంకె నిదిగో మధ్యాహ్న కాలంబునన్"** (చా.ర.)

కీర్తింపందగు రాము సాయకమహాగ్నిజ్వాల తుంభున్ విశా
వర్తిన్ రావణుఁ గాంచి నారదుఁడు దేవాధ్యక్షుతోఁ బల్కె ని
ట్లార్తిం బొంద మిమున్ జయించుగద! మున్నత్యుగ్రుఁడై దైత్యరా
ణ్మార్తాండుం, డపరాద్రిఁ గ్రుంకె నిదిగో మధ్యాహ్న కాలంబునన్. (మో.వెం.)

(విశదల శతావధానం)

ఆర్తిన్ వేల్పులు కావుకావుమని హాహాకారముల్ సల్పఁగా
ధూర్తుల్ ధారుణి నిల్వఁగూడదని రుద్రుం డాజ్ఞ నీఁ గాళి దు
ర్వర్తుల్ కావున దైత్యులం దునిమి యాసైఁ జంప శంభాసురే
ణ్మార్తాండుం డపరాద్రిఁ గ్రుంకె నిదిగో మధ్యాహ్న కాలంబునన్. (కా.సో.)

**146. "మీనాక్షికిఁ గుచము లాలు మీనశరీరా!"** (చా.ర.)

మానశరుఁడు నారసమునఁ
బూనిక సుమకందుకములఁ బొసఁగించె ననం
గాను విలసిల్లె నంతయు
మీనాక్షికిఁ గుచము, లాలు, మీనశరీరా! (మో.వెం.)

**147. "మీసము చుట్టుకొన్నది సుమీ! యిటు మో మటు త్రిప్పఁబోకుమీ"** (శ.సా.పూ., ధవళేశ్వరం)

హాసముమోమునం జెలఁగ నంగజు ప్రేరణచేఁ బ్రియుండు దన్
మోసముచేసి మోవిఁగొన, ముద్దియ పెన్గఁగ సాగె, నవ్వు నాఁ
డా సఖితోడఁ బల్కు నిటు, "అక్కట! యుల్లరి మామ, నత్తులో
మీసము చుట్టుకొన్నది సుమీ! యిటు మో మటు త్రిప్పఁబోకుమీ." (తి.వేం.)

148. "ముట్లుడిగిన సతికి నొక్క మొగశిశు వుట్టెన్" (తె.స.)

ఇట్లా కఠిన ప్రాసము
లెట్లాంటి కవీంద్రుకయిన నీయుం దగునా?
యట్లయితే నవమాసపు
ముట్లుడిగిన సతికి నొక్క మొగశిశు వుట్టెన్. (?)

149. "రంగులు ఘోషించె మేఘరావము పోల్కన్" (శ.సా.ఉ. విశాఖపట్టణం)

రంగుమెయి హొంగు లందఱుఁ
బొంగుచు వందలకొలంది 'బోయర్ను' పయిన్
సంగతముగఁ గాల్చించు ఫి
రంగులు ఘోషించె మేఘరావము పోల్కన్. (తి.వేం.)

150. "రండల దర్శింపఁగోరు రాజులమనముల్" (శ.సా.పూ., కాకినాడ)

పండితవాక్యశ్రవణము
దండుగఁగాఁనెంచి దానఁ దగులుకొనవు వో
కుండలు గడిగెడు దాస్యపు
రండల దర్శింపఁగోరు రాజులమనముల్. (తి.వేం.)

151. "రండాగమనంబుఁ జేయు రమ్యంబ యగున్" (చా.ర.)

కుండినపురమున రుక్మిణి
చండికకుం బూజసలుపు సమయంబున కా
యుండజవాహనుఁ డోడ్కొని
రం, డాగమనంబుఁ జేయు రమ్యంబ యగున్. (మో.వెం.)

152. "రంభముఁ గడుపార మెక్కె రవి తాపమునన్" (చీరాల శతావధానం)

అంభఃపానంబున సం
స్తంభింపని జాఠరాగ్నిఁ జల్లార్పఁగ సం
రంభమును బూని యొకఁడు క
రంభముఁ గడుపార మెక్కె రవి తాపమునన్. (కొ.సో.)

153. "రంభలతోడ రంభ ఘనరాగమునన్ భయ మాపుఁడీ యనెన్" (శ.సా.ఉ., లక్ష్మీనరసాపురం)

జంభరిపుండు తుల్యముని సల్పు తపంబు నడంచుపొంటె సం
రంభముతోడ నచ్చటికి రంభను బంపఁగ నామెయున్ జెలుల్

దంభపు దృష్టిఁ జూడఁగను దన్మని కోపఫలత్వలాయనా
రంభలతోడ రంభ ఘనరాగమునన్ భయ మాపుఁడీ యనెన్. (తి.వేం.)

**154. "రక్తంబంచును నిర్మలోదకమునుం ద్రావంగ శంకించెఁ దాన్"**
(గుంటూరు శతావధానం)

రక్తాంభోజసమానపాణి యుగుమున్ రంజిల్లు బింబోష్ఠి ధీ
శక్తుల్లేమిని ముగ్ధ గావునఁ బిపాసాయాసముం దీర్ప నా
సక్తిన్ దోసిటఁబట్టి కేలుగవఁ గెంజాయల్ విడంబింపఁగా
రక్తంబంచును నిర్మలోదకమునుం ద్రావంగ శంకించెఁ దాన్. (కొ.సో.)

**155. "రతిరాజ గృహంబుమీఁద రవి యుదయించెన్"** (తి.వ.)

అతివలమొగ మెఱుఁగక యా
గతి వతిరతివాంఛఁ దగిలి కష్టసుఖములన్
మతిఁ దలఁపవు, లేలెమ్మిక
రతిరాజ! గృహంబుమీఁద రవి యుదయించెన్. (?)

**156. "రతి సేయుఁగ రమణి నవ్వె రమణుం డేడ్చెన్"** (తి.వ.)

పతియొక్కతె రేపల్లెను
బతితో రతికేళి సేయఁ బద్మాక్షుఁడు దాఁ
బతి నీడ్చివేసి తానే
రతి సేయుఁగ, రమణి నవ్వె రమణుం డేడ్చెన్. (?)

**157. "రమణికుచంబుమీఁద నొక లంపము కత్తియు రాజహంసయున్"** (తి.వ.)

సమరతి సేయువేళఁ బతి సంభ్రమమంతయుఁ జూచి యాత్మలోఁ
గుములు మనంబుతోడుతను గూర్మి బయల్పడనీక వేగమే
కమలదళంబులో నిడిన కస్తురిచే లిఖియించి చూపినన్
రమణికుచంబుమీఁద నొక లంపము కత్తియు రాజహంసయున్. (?)

**158. "రవి గాననిచోఁ గవి గాంచునే గదా!"** (శ్రీకృష్ణదేవరాయలు)

అరవి వీరభద్రచరణాహతి డుల్లిన బోసినోటికిన్
వేరఁడు రామకృష్ణకవి నేరిచెఁబో మన ముక్కుతిమ్మరాట్
క్రూరపదాహతిం దెగిన కొక్కిరి పంటికి దుప్పికొమ్ము ప
ల్గా రచియింప నౌర! రవి గాననిచోఁ గవిగాంచునే గదా! (?)

159. "రాతిరివేళ భాస్కరుఁడు రమ్యముగా నుదయించెఁ దూర్పునన్" (తె.వ.)

వాతతనూజ! భానుసుత! వాలితనూభవ! వహ్నిపుత్రకా!
సేతువుగట్టు కాల మిదె శీఘ్రముగాఁ గొనిరండు కొండ, లీ
రీతిగ నిద్రఁ బోఁదగదు, లెండిఁక, నిద్దురపోవఁగా నగున్
రాతిరివేళ, భాస్కరుఁడు రమ్యముగా నుదయించెఁ దూర్పునన్. (?)

160. "రారా తమ్ముఁడ! రారయన్న! యనియెన్ రాజాస్య ప్రాణేశ్వరున్"
(వంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

సారా త్రావు టనర్థహేతు వది లజ్జాజ్ఞాన మర్యాదలన్
నీరుం జేయుట నిక్క, మిద్ది వినుఁ, డా నీరుం గడుంద్రావి, దు
ర్వారంబౌ కయిపెక్క, మైమఱచి, నిర్వస్త్రాంగియై నవ్వుచున్
రారా తమ్ముఁడ! రారయన్న! యనియెన్ రాజాస్య ప్రాణేశ్వరున్. (కా.సో.)

161. "రారా తమ్ముఁడ! రారయన్న! యనె నా రాజాస్య ప్రాణేశ్వరున్" (వా.ర.)

గారాబల్లుఁడు అర్జునుండు శ్వశురాగారంబునం దుండఁగా
నీరేజాస్య సుభద్ర వచ్చి యతనిన్ వీక్షించి పెన్సిగ్గునన్
బాలుం జొచ్చిన సత్య పట్టుకొని యుంపారంగ న య్యర్జునున్
"రారా తమ్ముఁడ, రారయన్న!" యనె నా రాజాస్య ప్రాణేశ్వరున్. (మో.వెం.)

162. "రావే! మానిని! కావవే తరుణి! సంరక్షించు చంద్రాననా!" (తె.వ.)

పూవిల్కాని సరోజబాణముల నంభోజారి మైచాయలన్
భావం బెంతయు డస్సి, మేను బడలెన్, దాపంబు రెట్టించె, నే
నీవాఁడన్ మధురాధరం బొసఁగవే నిక్కంబు నన్నేలవే
రావే! మానిని! కావవే తరుణి! సంరక్షించు చంద్రాననా! (?)

163. "రుక్మిణి చనుమొనలమీఁద రోఁకలి విరిచెన్" (తె.వ.)

రుక్మిణిదేవిని నెత్తుక
రుక్మిణిపతి పోవుచున్న రూఢిగ నపుడే
రుక్మి యనువాఁడు తాఁకిన
రుక్మిణి చనుమొనలమీఁద రోఁకలి విరిచెన్. (?)

164. "రోమము సౌఖ్యమిచ్చుచును ద్రోవదితో యశమొల్ల బాడగున్"
(గుంటూరు శతావధానం)

ఏ మొకపక్షమూనుకొను టేటికిఁ బౌరుల మాటఁజేసి మా
కేమిటనైనఁ గష్ట మొకయించుక రా దదియెట్టులన్న సం
గ్రామమునం జయంబుఁగొని కౌరవపాండవులందు వీరొ వా
రో మము సౌఖ్యమిచ్చుచును ద్రోవదితో యశమొల్ల బాడగున్. (కా.పా.)

165. "వంకాయను జెఱకురసము వడియుచు నుండెన్" (తె.ప.)

పంకజముఖిగురుకుచములఁ
బొంకముగా గురియొనర్చి పూవిలుకాడున్
ఉంకించి శరము దొడిగిన
వంకాయను జెఱకురసము వడియుచు నుండెన్. (?)

166. "వక్త్రంబుల్ పది, కన్ను లైదు, కరముల్ వర్ణింపఁగా వేయగున్" (వా.ర.)

ఈఁక్రప్రాసము కష్టమౌననుచు నమీరింతేసివా రాడఁగా
వాక్రాసం బది సత్కవీశ్వరుల త్రోవల్ గామి నేఁ జెప్పెదన్
దిక్క్రారాతికిఁ బార్వతీశ్వరులకున్ దిగ్మప్రభారాశికిన్
వక్త్రంబుల్ పది, కన్ను లైదు, కరముల్ వర్ణింపఁగా వేయగున్. (మొ.వెం.)

167. "వట బీజములంతలేసి వనిత కుచమ్ముల్" (శ.సా.ఉ., నూజివీడు)

చటులాక్షి వయసు ముదురని
మటమట నీకేల? మధ్యమవయస్సుఁట, యో
విట! కొబ్బరిబొండాల్ గా
వఁట, బీజములంతలేసి వనిత కుచమ్ముల్. (తి.వేం.)

168. "వదలవద్రోయము వాంఛ్రధవి వామపదంబున నున్న నూపురం
బుదిత మరాళకంఠ వినదోక్తుల నేమని పల్కు? పల్కురా!" (?)

గుదియులకామి నున్నని త్రికోణముపైఁగల భాగ్యరేఖ నీ
నుదుటను లేదులే దనుచు నూఱువిధంబుల నొక్కి పల్కురా. (రామకృష్ణుడు)

169. "వనమా సాహసమింత చెల్లదు సుమా బాగోగు లూహింపుమా"
(వంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

ధనమానంబులఁ గొల్లవెట్టి, కులగోత్రవ్యక్తిఁ బోఁదట్టి, దు
ర్వనితాసంగము మెచ్చఁబెట్టి, పగలుల్ రాత్రుల్ నను న్మోహ పా

శనిబద్ధాత్మ నొనర్చె దేమిటికి? నీ సౌభాగ్య మెన్నాళ్లు? యౌ
వనమా! సాహసమింత చెల్లదు సుమా బాగోగు లూహింపుమా. (కా.సో.)

170. "వర్షాకాలము వచ్చె గ్రీష్మమువలెన్ వైశాఖమాసంబునన్" (చా.ర.)

హర్షం బెట్లగు? కృష్ణదేవుఁ డిటకై యబ్జాక్షి! రాడాయె సా
మర్షాహంకృతిఁజంద్రుఁ డేచుతఱి భీమద్వేషసామోగ్రదు
ర్ధర్ష క్రూరనిశాతఘాతనవచూతవ్రాత బాణావళీ
వర్షాకాలము వచ్చె, గ్రీష్మమువలెన్ వైశాఖమాసంబునన్. (మో.వెం.)

171. "వారికి వారికిన్ మఱియు వారికి వారికి వారివారికిన్"

(వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు)

భూరమణీమనఃకుముదపుంజ సుధాంశుని వేంకటాద్రి ల
క్ష్మీరమణావతారుని భజింతురు రాజులుఁ దత్సుతుల్ హితుల్
సూరిజనుల్ దదీయులును సొంపుగ నా ప్రభువిచ్చుఁ గోరికల్
వారికి వారికిన్ మఱియు వారికి వారికి వారివారికిన్. (వఠ్ఠెం విరూపాక్షశాస్త్రులు)

172. "విధవాగమనంబు మిగుల వేడుక చేసెన్" (తె.ప.)

అధికారిదర్శనేచ్ఛా
గ్రథితుఁడనై సుశకునంబుఁ గాంక్షింపఁగ నా
కధికఫలప్రద యగుచును
విధవాగమనంబు మిగుల వేడుక చేసెన్. (?)

173. "విపరీతపుఁ బులుసుకూర విస్తరి ప్రింగెన్"

అపురూపపులేఁతాకుల
విపరీతపుబ్రాహ్మణుండు విస్తరిఁ గుట్టెన్
చపలాక్షి వండిపెట్టెను
విపరీతపుఁ బులుసుకూర విస్తరి ప్రింగెన్. (?)

174. "విస్ఫురిత ఫణామణిద్యుతులఁ బొల్చగు నాగకుమారుఁడో యనన్"

(శ్రీకృష్ణదేవరాయులు)

వరుఁడు చెఱంగు పట్టినను వల్వ తొఱంగిన లేమ సిగ్గు ప
ట్టు రుతరరత్నముద్రికల నొప్పగు డాపలికేల మూయఁగాఁ
గర మమరెం గరం బపుడు కామనిధానముఁ గాచియున్న వి
స్ఫురిత ఫణామణిద్యుతులఁ బొల్చగు నాగకుమారుఁడో యనన్. (అలసాని పెద్దన)

175. "పీపునఁ జండ్లుండు గోళ్ల వెంద్రుక లుండున్" (తె.స.)

గోపాలకృష్ణమూర్తిని
గోపిక యొకనాఁడు ముందుగొని తలకురులన్
బ్రాపుగఁ జిక్కులు తీర్పఁగ
పీపునఁ జండ్లుండు గోళ్ల వెంద్రుక లుండున్. (?)

ప్రాపని నమ్మిన యొక సతి
కాపేయముతోడ వచ్చి కడుమోదముతో
రూపవతి పేలు చూడఁగ
పీపునఁ జండ్లుండు గోళ్ల వెంద్రుక లుండున్. (?)

176. "వైశాఖము మునిఁగిపోయె వననిధి నడుమన్" (గుంటూరు శతావధానం)

ఆశరులును వేల్పులు నమృ
తాశ వనధి మందరాద్రి నటు దఱవఁగ లో
కేశు కృపలేమి గిరియగు
వైశాఖము, మునిఁగిపోయె వననిధి నడుమన్. (కొ.సో.)

177. "శంఖంబుల్ దివినుండి జాఱిపడియెన్ జంబూఫల ప్రక్రియన్" (చా.ను.)

ప్రేంఖత్పుష్పక చంపకాటవుల దారిన్ వ్యోమమార్గంబునన్
రింఖద్వాయువశంబునం దగిలి యా నెత్తావికిం జొక్కి త
త్పంఖాక్తంబులు తేంట్లమొత్తములు లక్షల్ కోట్లు పద్మంబులున్
శంఖంబుల్ దివినుండి జాఱిపడియెన్ జంబూఫల ప్రక్రియన్. (?)

178. "శంఖంబుల్ దివినుండి వచ్చె నిదిగో జంబూఫల ప్రక్రియన్" (తె.స.)

ప్రేంఖత్ప్రేమను సత్యభామకొఱకై కృష్ణుండు నీరేజరా
ట్యంఖాణంబు నదల్చి కల్పకము వేగం దేఁగఁ దద్వాసనా
రింఖాయుక్తములై మిళిందములు పేర్మిం బద్మసంఖ్యల్ మహా
శంఖంబుల్ దివినుండి వచ్చె నిదిగో జంబూఫల ప్రక్రియన్. (?)

179. "శనికిన్ భయమందనట్టి చతురుం డితఁడే" (బాపట్ల శతావధానం)

వనజాక్షుబహిఃప్రాణం
బనఁదగు విజయుం డితండె యమరేంద్రువనం
బును వహ్నికిచ్చి యుగ్రా
శనికిన్ భయమందనట్టి చతురుం డితఁడే. (కొ.సో.)

180. "శుభ్రాదభ్రయశస్కు, నభ్రపదు విష్ణుం జేకొనెన్ భర్తగా"
(సంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

ప్రభ్రాజ న్మహిమన్ సుపర్వుల సుధం ద్రావించె నంచున్, బయో
జభ్రూణ స్తుతు లొందెనంచు, నసదృక్సౌందర్యుఁ డంచున్, రమా
సుభ్రూరత్నము, చంద్రసోదరి సురీస్తోమార్చితాంఘ్ర్యబ్జయై
శుభ్రాదభ్రయశస్కు, నభ్రపదు విష్ణుం జేకొనెన్ భర్తగా. (కా.సో)

181. "సంయమివరుఁ డూఁగుచుండె సంసారమునన్" (శ.సా.ఉ., బందరు)

'కిం యాతి చోర్ధ్వలోక మ
యం యోగీ మేనకాన్వితో౽భూ' త్తని వా
చంయములు గుంద గాధిజ
సంయమివరుఁ డూఁగుచుండె సంసారమునన్. (తి.వేం.)

182. "సంయమివరుఁ డౌటఁ గుదిరె సంసృతి సుఖముల్"
(కామకోలను త్రివిక్రమరామారావు, మద్రాసు)

సంయుక్త సుగుణపుంజా!
సంయమనీనాథ పుత్రసన్నిభ! సర్వా
హంయుద్వేషీ వినుమీ
సంయమివరుఁ డౌటఁ గుదిరె సంసృతి సుఖముల్. (కా.సో.)

183. "సతి సతిఁ గవియుంగఁ బుత్రసంతతి కలిగెన్" (శ.సా.ఉ., విశాఖపట్టణం)

అతికుతుకం బలరారఁగఁ
జతురత వెలయుంగ మదనశాస్త్రవిధమునన్
వితతంబగు తనసాధన
సతి సతిఁ గవియుంగఁ బుత్రసంతతి కలిగెన్. (తి.వేం.)

(గుంటూరు శతావధానం)

సుతకీర్తి మీఱ లోకం
బతిశయముగ వృద్ధిగనఁగ నాత్మభవ సుఖో
న్నతులు దులకింపఁ బతిఁ బతి
సతి సతిఁ గవియుంగఁ బుత్రసంతతి కలిగెన్. (కా.సో.)

184. **"సరసునినైపు పీపు సల చానమొగం బటు గోడనైపునన్"** (శ.సా.ఉ., వీరవరం)

సరసునినైపు పీపు నల చానమొగం బటు గోడనైపు, నా
సరసుఁడు కేలుచాపు, నల చానయుఁ జన్నులఁ జేయిమోపు, నా
సరసుఁడు కోర్కెఁజూపు, నల చాన తొడం దొడలోన దోపు, సీ
సరుసని తెల్లవారి నొక సైఖరి నొక్కని కొక్క వేశ్యతోన్. (తి.వేం.)

(పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

సరసుఁ డొకర్తుఁ గూడెనని స్వాంతమునం గడు సీర్ష్యఁ జెంది సుం
దరి యటు గోడనైపునకుఁ దా మరలంగ, నసత్యమంచు నా
సరసుఁడు వెన్ను నాముకొని సాంత్వనవాక్యము లాడఁ, దోఁచెడున్
సరసునినైపు పీపు నల చానమొగం బటు గోడనైపునన్. (కొ.సో.)

185. **"సారమహనీయమహిమ కాధారమగుచు" - క్షీరసముద్ర విషయముగా సీసములో**
(పంగిడిగూడెం సంపూర్ణ శతావధానం-2)

విష్ణువక్షస్స్థల విహారిణి శ్రీ ధన్యఁ
గమలాలయాదేవిఁ గన్న కతన
నాదితేయులను దివ్యామృతంబున జరా
మరణవర్జితులుగా మనుచు కతనఁ
గల్పకద్రుమపంచకంబుఁ జింతామణి
స్వర్గపాలకున కొసంగు కతన
వెలుఁగుతేనికి జోడు గలుగ వెన్నెలతేని
సృష్టిఁ జల్లని మతిఁ జేయు కతన.
ధేనువుల కగ్రగణ్యమై తేజరిల్లఁ
గామధేనువు నొదవించు కతన, క్షీర
జలధివర్యంబు సర్వసంస్తవ్యమయ్యె
సారమహనీయ మహిమ కాధార మగుచు. (కొ.సో.)

186. **"సింగములన్ మట్టె గంధసింధుర మయయో!"** (శ.సా.ఉ., విశాఖపట్టణం)

పొంగుచుఁ గొందఱు రాజులు
సింగారము లొలుక వేటసేయం జని వే
ద్యం గెలనఁ దిరుగ నా రా
సింగములన్ మట్టె గంధసింధుర మయయో! (తి.వేం.)

187. "సుగ్రీవుని యొడమకాలు శునకము గఱచెన్" (చా.ర.)

అగ్రారపునడివీథిని
విగ్రహముగ బొమ్మలాట నేర్పుగ వాడన్
విగ్రహములెత్త మఱచిన
సుగ్రీవుని యొడమకాలు శునకము గఱచెన్. (మో.వెం.)

188. "సూర్యుఁ డుదయశిఖరినెక్కెఁ జుక్కలు వొడిచెన్"
(కందములోఁదప్పు: శ.సా.ఉ., బందరు)

గ్రహణదినమైన కతమునఁ గబళనంబు
సలిపె రాహువొ కేతువో గిలితుఁ డయ్యె,
గార్యభరమున నట్టులే "సూర్యుఁ డుదయ
శిఖరినెక్కెఁ జుక్కలు వొడిచెన్" దళముగ. (తి.వేం.)

189. "పొరచెట్టున బీరకాయ పొంపుగఁ గాచెన్" (తె.ప.)

అరవిందకోమలంబగు
నరవిందపుఁగొలను కెలన నావల పిఱుఁదన్
గరిమను పొంపుగఁ జూచిన
పొరచెట్టున బీరకాయ పొంపుగఁ గాచెన్. (?)

# ప్రాచీ ప్రచురణలు

పుణ్యభూమి - బూదరాజు రాధాకృష్ణ
*1/8 డెమ్మీ    VIII+199 పేజీలు    రు. 90/-*

సూక్తి ముక్తావళి - మహీధర జగన్మోహనరావు
*1/8 డెమ్మీ    XXXVI+434 పేజీలు    రు. 200/-*

ప్రాచీనాంధ్ర నౌకాజీవనము - భావరాజు వేంకటకృష్ణరావు
*1/8 డెమ్మీ    173 పేజీలు    రు. 75/-*

వంతెన (కథాసంకలనం) - ఉషారాణి భాటియా
*1/8 డెమ్మీ    123 పేజీలు    రు. 50/-*

ఆధునిక వ్యవహారకోశం - బూదరాజు రాధాకృష్ణ
*1/8 డెమ్మీ    279 పేజీలు    రు. 100/-*

సంస్కృతాంధ్ర నిఘంటువు - వెల్లా వేంకటశేషయ్య
*1/8 డెమ్మీ    400 పేజీలు    రు. 120/-*

పురాణనామచంద్రిక - యెనమండ్రం వెంకట్రామయ్య
*1/8 రాయల్    252 పేజీలు    రు. 95/-*

కావ్యాత్మ - శే.వెం. రాఘవయ్యంగారు
*1/8 క్రౌను    359 పేజీలు    రు. 70/-*

ప్రాకృత గ్రంథకర్తలూ ప్రజాసేవానూ - పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి
*1/8 డెమ్మీ    128 పేజీలు    రు. 30/-*

పోరాటాలబాటలో అనుభవాలు, జ్ఞాపకాలు - యస్.వి.కె. ప్రసాద్, సుగుణ
*1/8 డెమ్మీ    143 పేజీలు    రు. 40/-*

మాధవ నిదానము - డి.వి. గోపాలాచార్యులు
*1/8 రాయల్    535 పేజీలు    రు. 300/-*

ఆంధ్ర వాఙ్మయసూచిక - కాశీనాథుని నాగేశ్వరరావు
*1/4 క్రౌను    624 పేజీలు    రు. 480/-*

***Rasaramya (Radio Plays)*** – *K. Chiranjeevi*
*11x20.5 cm    112 Pages, P.B.    Rs. 120/-*

***Random Writings*** – *Dr. Raj Bahadur Gour*
*1/8 Demy    XXII + 206 Pages, P.B.    Rs. 250/-*

***Gandhi in the Twenty First Century***
***an Alternative Approach to Development*** – *Ed. Vasant Kumar Bawa*
*1/8 Demy    XVIII + 106 Pages, H.B.    Rs. 125/-*

***Occasional Papers in language and literature*** – *Budaraju Radhakrishna*
*1/8 Demy    X + 155 Pages, H.B.    Rs. 200/-*

అష్టావధానంలో
సమస్యాపూరణం
ఒక ప్రధానమైన ప్రక్రియ,
అష్టావధానంలో
నిమిత్తంలేని
పద్యక్రీడకూడా.

గతంలో
ప్రసిద్ధులైనవారు కొందరు
చేసిన సమస్యాపూరణాలను
మళ్ళీ పరిచయం చేసే
చిరుప్రయత్నం యిది.

ISBN: 81-7443-017-2

# తెలుగులో సమస్యాపూరణాలు



కూర్పు:

బూదరాజు రాధాకృష్ణ